# కోపల్లె వేంకటరమణరావుగారి సాంఘిక నాటకములు

## పెట్టమారి మగడు

భార్యాభర్తల దాంపత్య వైరుధ్యాలను బహిరంగపరచి. తప్పులను చీవాట్లచే దిద్దించి సన్మార్గమునకు దెచ్చి, విద్యావంతుడయ్యు సంపాదనా శూన్యుడై, ఇతరజనకులచే నగుబాట్ల నొంది జీవించు మానవు నిందు సృష్టించి దైనందినజీవితమందు సంసారములందలి సాంఘిక దుర్బలత్వమును తీర్చి కూర్చబడినది. వెల రు 1—8—0

## బలే పెళ్ళి చర్చ

ముసలి పెళ్ళికొడుకుల ముచ్చట్లు, పడుచు భార్యల అగచాట్లు. వృద్ధుని చెట్టబట్టియు స్పర్శదోషమైన లేక తన పవిత్రజీవయాత్రను గడపిన మగనాలి ఘట్టాలు, అంటరానివాళ్ళ ఆపదలు, మనువర్తికై దావాచేసిన పడుచుభార్య విప్లవధోరణి యిందు కాననగును. వెల రు 1—8—0

## భాగ్యరేఖ

సాహిత్య సమ్రాట్టు శ్రీ జయపురం మహారాజావారి సన్నిధానమందు జరిగిన ప్రదర్శనంలో పారితోషికమందిన నాటకరాజము. దాంభికజీవనము గడపి సంస్థలకు పెద్దయై వాటి పెట్టుబడులను దుర్వినియోగ మొనరించి నిందలపాలైన కృష్ణశాస్త్రి పాత్రను, మోసముచేసి గడించి కాఫీహోటలు నడిపి చివరకు దివాలాతీసిన యజమాని వింతకథ నిందు చిత్రింపబడినది. వెల రు 1—8—

## గరల్ వైఫ్

సమర్తాడకుండా శోభనంచేసే మూఢులైన తల్లిదండ్రులను బుద్ధి చెప్పి అల్లుళ్ళతో సరసాలాడే అత్తలను చీవాట్లుపెట్టి మోసపు స్నేహితురాండ్ర మాటలు విని చెడిపోయే బుద్ధిహీనులను మంచిత్రోవకు త్రిప్పి నీతినిలయము మనిపించుకొనే నాటకమణి. వెల రు 1—8—0

## ఓల్డ్ డాటర్

ధనికుల యిండ్లలో చనవుగా సంచరించే దాసీల చర్యలు, యాయవార బ్రాహ్మణుని దుర్నడతలు, బాలవితంతువులకు పునర్వివాహము గావించనందున కలిగే అగచాట్లు కళ్ళకు కట్టినట్లు, యీ నాటకమందు చిత్రింపబడినది. వెల రు 1—8—0

---

# మోసఠికం


రచయిత

పోతరాజు రాఘవరావుగారు





పబ్లిషర్సు:

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,

రాజమండ్రి.

1951

వెల 1—8—0

రాజమహేంద్రవరమునందలి

శ్రీ కొండపల్లి ముద్రాశాలయందు

ముద్రింపబడియె

# హెచ్చరిక

## పాత్రల వివరము

### పురుషులు

1. మాధవరావు—ప్లీడరు (కథానాయకి తండ్రి)
2. ప్రభాకరం బి. ఏ.—ప్లీడరు మేనల్లుడు (కథానాయకుడు)
3. సురేష్—ప్లీడరుగారింట పెరుగుచున్న అనాథవిద్యార్థి
4. చంద్రశేఖరం—సురేష్ స్నేహితుడు
5. గోపీచంద్—మార్వాడీ
6. గోపాలం—ప్లీడరు బావమరది
7. పేరయ్య—పురోహితుడు

### స్త్రీలు

1. దుర్గాంబ—ప్లీడరుగారి భార్య
2. ఇందిర—ప్లీడరుగారి కుమార్తె (కథానాయకి)
3. శ్యామల—మార్వాడీ కూతురు

సందర్భానుసారముగా సబిన్‌స్పెక్టరు ప్రవేశించును.



# మే న రి కం



## ప్ర థ మాం క ము

### మొదటిరంగము

ప్రదేశము : ప్లీడరుగారి యిల్లు.

ప్రవేశము : మాధవరావు చేతిలో పేపరుతో

మాధ—ఆహా! ప్రపంచమెంత తారుమారై పోతూంది.

ఉ. కాలము మారిపోయె కలి ♦ కాలము శీఘ్రము దాపురించె నీ
కాలమునందు లేదు పని ♦ కార్మికు లందర కందు చేతనే
మాలనుఁగూడ దోపిడులు ♦ మోసము మీరుచునుండె వేగమీ
యాలము నాపుసేయుకయె ♦ నాడుచునుండగ నెల్లలోకోగదా!

(నిట్టూర్పు విడిచి సోఫాపై కూర్చుండి)

అబ్బబ్బ! యీరోజుల్లో ప్లీడరీ ఉద్యోగానికి ఏమీ value లేకుండా పోయిందికదా! ప్రతీవాడూ దీనికే తయారవడంవల్ల, ఉన్న ప్లీడర్లకు పెట్రోలు కర్చుకన్నా డబ్బు రావడములేదు. పాక్టీలో స్త్రే డొక్కాడడము లేకపోతే పస్తు. అందులోనూ యీ యుద్ధం పెనుభూతంలాగ దాపురించి మానోట్లో పూర్తిగా దుమ్ముకొట్టింది. ఏదో యిదివఱకు నాలుగురాళ్ళు సంపాదించుకొన్నాము కాబట్టి యీకఱవు కాలంలో సంపాదింప లేకపోయినా లెక్కలేకుండా ఉంది. (పేపరు చూచుచూ) దుర్గా! దుర్గా! అబ్బ! పలుకవేమే,

దుర్గ—(లోపలనుండి) వస్తున్నా।

మాధ—కొంచెము కాఫీ తీసికొనిరా!

దుర్గ—(కాఫీ కప్పులతో ప్రవేశం)

మాధ—(కాఫీ త్రాగుచూ) దుర్గా! విన్నావటే. ఎటువంటి వారు కాలు జరుగుచున్నారో.

దుర్గ—చెప్తేగా వినడానికి ఏమిటంత గొప్పవిశేషం!

మాధ—ఏముంది. కాంగ్రెసువారు [illegible] వ్యవహారముచే ఒక వ్యక్తి ఒక ఉద్యోగిని చంపి [illegible] తిరస్కరించినాడట.

దుర్గ—అబ్బబ్బ! ఏమిటండి. యీకాలపు పురుషులకు కాంగ్రెసవారి మాలవుందు యింత వ్యామోహం పుట్టింది.

మాధ—ఏమి? యీకాలపు పురుషులంటే సామాన్యు లనుకొను చున్నావా! చూడు.

సీ. కూటికి కరవైన ♦ గోటుసేయుంగను
సూట్లు బూట్లును దాల్చు ♦ నెంతగొప్పొకడు
భక్తుడనని మేడ ♦ భజనల సల్పుచు
పడతుల భ్రమపెట్టు ♦ భ్రష్టుడొకడు
చీటికి మాటికి ♦ చేతులం జాపుచు
కక్కుర్తి పడుచుండు ♦ కలుషి యొకడు
ఘనత కావలెనంచు ♦ ఘనపదవులు గోరి
యర్ధాంగినే దాల్చు ♦ యధముడొకడు

గీ. కలియుగంబున యెందరో ♦ కలరు భువిని
భరతమాత కమిత మనో ♦ వ్యధను గూర్చ
వీరి జూచి సహింప భూ ♦ భారమనెడి
భవ్యమాత దిగులు బాప ♦ భరముగునాగా!

దుర్గ—ఓహోహో! పాపం. ఏమి దాతృత్వమండి. యీ వున్నది
కాస్తా అయిన తర్వాత మీ ముఖాన్ని చూసేవాళ్లెవ్వరూ
ఉండరు

మాధ—అదటుంచి యిలా విను. మన ప్రభాకరం సుగుణసంపద
చూచి ఇందిర నిచ్చి వివాహం చేయాలని అభిలాషగా ఉంది.

దుర్గ—ఏమిటీ! ఏమన్నారూ ?

మాధ—ఏమంది. మన యిందిరా ప్రభాకరు లొండొరులనమితముగా
ప్రేమించుకుంటూన్నట్లు వారి ప్రవర్తనను బట్టి తెలుస్తూంది.
అదీగాక యిందిరకు యుక్తవయస్సు వచ్చింది. అందుచేత
వారిద్దరిని దంపతులు చేద్దా మనుకుంటున్నాను.

దుర్గ—యింకేమి. మేనల్లుని అల్లునిగా చేయ దలంచుకొన్నారా? అన్నీ
బాగానే ఉన్నాయి గాని మన ప్రభాకరంలో ఒక్క లోపం
మాత్రం ఉంది.

మాధ—ఏమిటది?

దుర్గ—పాపం. ఏమీ తెలియనట్లు మాట్లాడు తున్నారే. అవును లెండి.
అల్లుడు మామ లిద్దరూ ఏకాభిప్రాయములతో మసలుతూ
ఉంటే ఎలా తెలుస్తుంది ?

మాధ—అబ్బబ్బ! తప్పులుంటే వేధించక చెప్పకూడదూ?

దుర్గ—అలాగైతే వినండి. యీకాలపు పిల్లలకు మామూలేకాదూ!
పత్రికల్లోవి, నవలల్లోవి నాలుగుముక్కలు నంజుకోవడం, పెద్ద
సంఘసంస్కర్తనంటూ బయలుదేరడం, మనవాడు కూడా
బ్రహ్మసమాజంలో చేరి విధవావివాహాలు శాస్త్రీయమేయని
ప్రచారము చేస్తున్నాడుట.

మాధ—ఓహోహో! యిదా అతడు చేసే తప్పు. యీవిధవావివా
హములు నేమహాత్ము డామోదించెనో యెఱుగుదువా ?

మాధ—నీవింకా పెరటిత్రోవనే ఉన్నావు. కాలానుగుణంగా ప్రవర్తించాలి కాని పెద్దలో పెద్దలో అంటూ పిచ్చి అభిప్రాయాలతో వుంటే ఏమిప్రయోజనం.

దుర్గ—నేను మొదటే అన్నానుగా. కాబోయే అల్లుడికి తరపునగాక పాతబడిన పెళ్ళాం తరపున మాట్లాడుతారా? యింతకూ నా కెందుకులెండి. మీ యిష్టమొచ్చినట్లే చేయండి. పెళ్ళాంనని ఏమైనా గౌరముంటేగా.

మాధ—అదుగో, అప్పుడేవచ్చింది కోపం. మాటవరుస కన్నాను గాని దాని బాధ్యత నీకుమట్టుకు లేదూ?

దుర్గ—అందుకనే అల్లుని సరియైనత్రోవలో పెట్టమన్నాను.

మాధ—అలాగే. నీమాటప్రకారంగానే చేద్దాములే. (అంతసురేష్ పుస్తకములతో ప్రవేశించును.)

మాధ—(చూచి) రా! సురేష్! రా! యిలా కూర్చో.

సురే—చిత్తం.

మాధ—స్కూలు నుంచి రావడం యీవేళ యింత ఆలస్యమయిందేమి?

సురే—స్కూలులో Matches అవుతూంటే చూస్తూ ఉండిపోయినాను.

మా—ఏదో మిషపెట్టి నీవిలారోజూ ఆలస్యంగా వస్తూంటే ఎలాగ చెప్పు. యిన్నాళ్ళుజాగ్రత్తగా చదివేవు యీయేడాదికూడా కష్టపడి చదివి B. A. Complete చేసావంటే ఎక్కడో అక్కడ నాలుగురాళ్ళు తెచ్చుకోవచ్చు. దానితో నాశ్రమ కూడా ఫలిస్తుంది.

సురే—అయితేనన్ను యే activities లోనూ Part తీసుకోకుండా ఎప్పుడూ పుస్తకములు బట్టుకొని ఏడవమంటారన్నమాట.

దుర్గ—ఆయన అన్నారంటావు కాని నీకు మాత్రం తెలియదూ. ఆయన నీ శాగుకోరి చెప్తారు కాని నీమీద విరోధంగా చెప్తారా?

సురే—సరే లెండి. యింతటినుండి త్వరగానే వస్తాను లెండి. అన్నిసార్లు చాలు చంపుకొంటాను లెండి.

మాధ—ఏమి నాయనా, నేనన్నానని కోపంవచ్చిందా?

సురే—ఎంతమాట. అనాథుడనైన నన్నాదరించి, విద్యాబుద్ధులు నేర్పించి యింతవఱకూ పోషిస్తూన్న మీరనకపోతే నన్ను యింకెవ్వరంటారు. చెప్పండి ఎవరికి కావాలి నాగొడవ.

మాధ—ఆజ్ఞానమింక చాలు గాని నీకెక్కడైనా యిందిరా ప్రభాకరులు కనిపించారా?

సురే—లేదు.

మాధ—ఎక్కడకు వెళ్లేరు చెప్మా

[యిందిరా ప్రభాకరుల ప్రవేశం]

దుర్గా—మాటలోనే వచ్చారు. నూరేళ్ళు ఆయుష్షు తల్లి నీకు.

ఇంది—నాకు నూరేళ్లాయుష్షయితే మరి బావకో.

మాధ—ఆతనికీ అంతే.

(యిందిరా ప్రభాకరులు కూర్చుందురు)

యింది—(చటాలున సురేష్‌ను జూచి) ఓహో! తమరా నమస్తే. సురేష్ బాబుగారూ!

సురే—ఏమి యీ వేళింత బిరుదులతో సంబోధిస్తున్నారే.

ఇంది—గౌరవనీయుడవైన నిన్ను నీ ప్రియురాలిముందు సామాన్యంగా సంబోధిస్తే బాగుండదని.

మాధ—ఏమిటీ! సురేష్ ప్రియురాలిని కూడా సంపాదించే దేమిటి.

దుర్గ—అయితే యింతకూ కోడలెక్కడుందో కనుక్కోండి.

ఇంది—ఎక్కడుంటుంది. అతని కూడానే ఉంటుంది. చూడండి. జేబులోనే ఉంది.

(అందరూ సురేష్ కోటు జేబువైపు చూడగా శ్యామలపట
కనబడును. దానిని సురేష్ దాచివేయ ప్రయత్నించును.)

మాధ—మరేమి కంగారుపడకు. ఏదీ ఆబొమ్మ నిటుచూడనీ.

సురే—అబ్బే! ఏమీలేదండి. యిది ఒక Friend photo.

మాధ—సరేలే ఎవరిదైతేనేమి. యిటుచూడనీ. చూచి సంతోషి
స్తాము (సురేష్ బలవంతముమీద photo యిచ్చును)

మాధ—యింకనేమి. సురేష్ చక్కని స్నేహితురాలిని సంపాదించేడు.

దుర్గా—ఎవరా? గోపీచంద్ కూతురు. శ్యామల. మనవాడి class-
mate.

దుర్గ—అప్పుడే యీ ముఖానికి ప్రియురాలు ప్రేమ కూడానా?

(అందరు ఒక్కసారిగా నవ్వేసురు. యిందిర విరగబడి నవ్వు
చుండును. సురేష్ తల వంచుకొనును)

దుర్గ—చాల్లే. కట్టిపెట్టు నవ్వు. నీ వింతవరకు ఎక్కడేడుస్తున్నావు?

యింది—బావస్నేహితున కొకనికి యీ వేళ సమాజంలో వివాహం
జరుగుతుంటే వెళ్లేము.

మాధ—వధూవరు లెవరు?

ప్రభా—'గ్లాడీదాస్' అనే ఒక క్రిష్టియన్ గరల్‌ను నాక్లాసుమేటు
రామం అనే Brahmin Boy కిచ్చి వివాహం చేసారు.

దుర్గ—(చెవులు మూసుకొని) రామ రామ! ఎటువంటి దారుణం
జరిగింది. మాలదాన్ని బ్రాహ్మణుడు పెండ్లిచేసుకొనడమే. పనీ
పాటలేని ఆదరిద్రుడు ఏగంగలోనో దూకుతూంటే, నీవుకూడా
వాడిని అనుసరిస్తావటే. వర్ణసంకరపు ముండాకొడుకు లేదో
ఏడుస్తూ ఉంటే ఘనంగా చూడ్డానికి వెళ్లేరూ. రామ రామ
అగ్నిలాంటి మనకులానికి అప్రతిష్ఠ తెస్తున్నారు.

ప్రభా—ఏమిటత్తా, అంతకోప్పడతావు. యిందిరది తప్పులేదు. నేనే
తీసికొని వెళ్లేను.

దుర్గా—గొప్పపని చేశావు. సిగ్గులేక యింకా మాట్లాడుతున్నావు. అయినకాడికి ఉన్నదంతా పాడుచేసి, పెద్దచదువు చదివి, యే ఉద్యోగమూ లేక యిలా అయిపోయినావని యేడవక, నేనూ మొగాడనేనని తలతిక్క లేనిపోని పనులు చేస్తూ దానిని కూడా పాడుచేయ దలంచుకున్నావా?

మాధ—ఎవరూ ఎవర్నీ ఏమీ పాడుచేయలేదు. నీవూరుకుందూ.

దుర్గ—మళ్ళా మొదలెట్టేరు మీారు. మీారు మాట్లాడకండి. యిదిగో! ప్రభాకరం. నీవు సమాజంలో చేరి నిత్యేమంలాంటి మనకుటుంబానికి అపయశం తెస్తున్నావు. యేనాడైనా యిటువంటి వర్ణసంకరపు పెళ్ళిళ్ళు, వితంతువివాహాలు యెరుగుదుమా?

ప్రభా—అత్తా! మాలదాన్ని పెండ్లిచేసుకోవడం తప్పా? అసలు మాలలంటే ఎవరో నీకు తెలియదు. విను.

గీ. కులసతుల ఘోషపెట్టెడి ♦ క్రూరమతులు
కరము తలిదండ్రులనెదుర్చు ♦ కఠినమతులు
దేవుడేలేడని తెల్పునా ♦ స్తికమతులును
అగ్రకులులైన, మాల ♦ లీయవనియందు.

కాబట్టి గుణములేని బ్రాహ్మణుడైనను కడజాతివాని సమానమే. అట్టివారినే మన మంటరాదని నిరసించాలి. అందుచే సుగుణవతియైన మాలదాన్ని పెళ్ళిచేసుకుంటేనీచము కాదనినాఅభిప్రాయము.

ఇంది—అవునే. అమ్మ. అవును. విధవావివాహాలుమాత్రము తప్పనుకున్నావా?

మాధ—యింతకుముందే దీనికి సర్వము బోధించాను అదివయ్యా.

దుర్గ—మీారూరుకోండి. యిదిగో ప్రభాకరం. తొండముదిరి ఊసరవెల్లియైనట్లు నీప్రవర్తనమితిమీారుతూంది. చివరకునా కేనీతులు నేర్పుచున్నావు. యిటువంటి అవకతవకపనులు చేస్తే యీ యింట్లో వీలుపడదు. మామనీకు తాళంవేస్తున్నారని నిందిస్తు

మొచ్చినట్లు ప్రవర్తించడానికి నేనొప్పుకోను. తెలిసిందా?
సురేష్ నీకు చెప్తున్నాను. రేపటినుండి లేనిపోని పికార్లు
చేయక జాగ్రత్తగా చదువుకో.

సురే—ఆ! అలాగే.

దుర్గ—ప్రభాకరం బాగా అర్థమయిందా?

ప్రభా—ఆ!

దుర్గ—ఇందిరా! నీకుయిదే చెప్పడం. తెలిసిందా?

ఇంది—తెలిసిందే బాబు తెలిసింది. నీమాటప్రకారమే నడుస్తానులే.

మాధ—దుర్గా! నీవుకూడ మామతమవలంబిస్తే ఎంతబాగుండును?
పూర్వాచారాల్లోపడి యీదులాడుతూంటే ఏమిలాభం?

దుర్గ—పూర్వాచారాలన్నీ మంటగలపబట్టే, యిలాగ ప్రపంచయుద్ధం
బయలుదేరి సర్వనాశనం చేసేస్తుంది.

(తెరలో) బాబుగారూ! ప్రొద్దుపోయింది. భోజనానికి లేవండి.

మాధ—వస్తాం. వడ్డించు.

(సురేష్ తప్ప అందరు నిలువబడియుందురు)

మాధ—నాయనా! భోజనానికి లేవవేమి? అలిగేవా?

సురే—అబ్బే! కాదండి. యిదిగోవస్తున్నాను. మీరునడవండి.

మాధ—సరే. త్వరగారా!

(సురేష్ తప్ప అందరు నిష్క్రమింతురు)

సురే—(ముందుకువచ్చి) ఏలాగైతేనే పోషిస్తున్నాడని యీయన
మాటలువిని, నాప్రియమిత్రుడు శేఖరాన్ని బ్రాందీసీసాను,
శ్యామలను వదలివేసి వెధవచదువు చదవనా? యిందిరా!
నన్ను నలుగురిలోను అవమానపరచినావుకదా సరే. నిన్ను
నీ ప్రభాకరంనుండి వేరుచేసి యీసంసారాన్నంతా పాడుచేసి
నిన్నెలాహింసిస్తానో చూడ్దువుగాని. మాధవరావు యికముందు

సురేష్ ఆజ్ఞ చవి చూడగలవు. (అని పిస్తోలు కాల్చుచు నిష్క్రమించును.) (తెర పడును)

---

## రెండవరంగము

[ప్రదేశము : గోపీచంద్ గృహము. శ్యామల పుస్తకము చూచుచు పాడుచుండును. గోపీచంద్ ప్రవేశము]

గోపీ—(చూచి) ఓహో! నీకు ఈవాళ బహుత్ సంతోషం వుంది అనుకుంటాను.

శ్యామ—రండి నాన్నగారు. యిలా కూర్చోండి.

గోపీ—అచ్ఛా! (సోఫాపై కూర్చుండును. శ్యామల ప్రక్కన కూర్చుండును.)

శ్యామ—నాన్నగారూ! నాకొక కోరిక వుంది. నెరవేరుస్తారా.

గోపీ—నీకోర్కె తీర్చడాన్కి మేమ్ హెప్పు అభ్యంతరం చెప్పమ్. నీకి సదా కావాల్అంటే ధన్ అన్నాం. యిప్పు ఏమీకావా లిసే చెప.

శ్యామ—ఏమీ లేదండి. మంచి సినిమా వచ్చిందండి. చూడాలని వుందండి.

గోపీ—ఛీ. సినిమాకీ వెళ్తానంటావ్. సినిమాల్కి చూస్తే చాలా మోసం జరుగుతుంది. పైసా ఖర్చుఅవుతుంది.

శ్యామ—మీరలా అంటారనే అనుకుంటున్నాను. పోనీలెండి. యీ మాత్రందానికే ఖర్చయిపోతుంది గాబోలు మీడబ్బంతా.

గోపీ—నీకు పైసాఅంటే హాల్కా తెల్సును. వడ్డీల్ మీద వడ్డీల్ పెంచి శ్రమపడి సంతగణించేమ్. దీన్కి ఖర్చుచేస్తే ఎట్లాగ?

శ్యామ—పోనీలెండి. సినిమాకేమాత్రం ఖర్చవుతుంది. మీర[illegible] మాను పైసా పైసా అంటారు. ఉన్నదంతా ఏంచేస్తారు!

గోపీ—హేమ్టి చేస్తాం. యింకా వడ్డీల్కి యిచ్చి హింతా హంతా చేస్తాం?

శ్యామ—అయితే మీ డబ్బుతో హాయిగా ఉండండి మీరు. నేను
యెక్కడికో పోతానులెండి. యీ ఖర్చుకూడా తగ్గుతుంది.

గోపీ—అరే ఉండవోయి ఉండు. నీకు హింతకోపం సేస్తె యెట్లాగు?
తబ్బు మాటకేమి? సినిమాకి నాటకంకీ జేబుదొంగల్
హొస్తారు.

శ్యామ—వస్తే మన్నేం చేస్తారు?

గోపీ—హేమ్టి చేస్తారు. జేబులో ఉండే మనీఫర్సుల్కి కొట్టేస్తారు.
మంచిమంచి హోదావాల్ని హల్లరిచేస్తారు బహుత్ మోసం
చేస్తారు.

శ్యామ—నాకేం భయం లేదండి. అక్కడ చాలామంది పోలీసువా
ళ్ళుంటారు.

గోపీ—పోలీసువార్కి కంట్లో దుమ్ము కొట్టి సేస్తారు. నీకు హేమీ
తెల్వదు.

శ్యామ—అయితే యింతకూ తీసుకెళ్ళనంటారు. అంతేనా?

గోపీ—అరే. ఉండు. బాగా ఆలోచనచేస్కో.

శ్యామ—బాగా ఆలోచించే మిమ్మల్ని అడిగేను.

గోపీ—సరే, అలాగే కానియ్యి. సైతాన్ పట్కున్నట్లు పట్కున్నావ్.

శ్యామ—(దగ్గరగా చేరి) నాన్నగారు మీరు చాలా మంచివారండి.

గోపీ—సినిమాకి తీస్కెడితే మంచి, లేకపోతే కాదూ.

శ్యామ—అది కాదండీ. మీరు యెప్పు మంచివారే.

గోపీ—నన్ను దొంగ హెధ్వ, హెక్కువవడ్డీల్ తీస్కుంటాడనితిడ్తార్.
నేను యెవర్కిమంచివాణ్ని కాదు.

శ్యామ—అలా అనకండి. అందరికంటె మీరు నయం.

గోపీ—నిజం. నిజం. హందర్కి కాంపౌండువడ్డీకి ఒక్కపైసా తగ్గిస్తాం.

అందుక్కా చేత మనల్ని కొందరు మంచిమంచి హాంటార్.

శ్యామ—సరేగానండి. నాన్నగారు. నాకొక చిన్నసందేహముండండి. తీరుస్తారూ.

గోపీ—(తనలో) అరే రాం రాం మల్లీడబ్బుఖర్చు అవడాన్కి ఏదో చెప్తు దికామోను. మంచీ చీరల్కి, పౌడర్కో తెమ్మంటుంది కాబోలు. (పైకి) అచ్ఛా! త్వరగా చెప్పు.

శ్యామ—నేను మీకుపుట్టినదాన్నేనా ?

గోపీ—అరే. నాకూ ఎలాపుత్తురా బాబు. నాకూ కాదు మా శేఠాసీకి.

శ్యామ—అయితే మీకడుపునపుట్టినదాన్నేనా ?

గోపీ—లేదువోయి. లేదు నాకుపుట్టలేదు.

శ్యామ—అదేనండి. అదే. పోనిమీ శేఠాసికి పుట్టినదాన్నేనా?

గోపీ—నై. నై. శేఠాసికి కాబు నాకూ కాదు. నాకు శేఠాసీకి మిల్కుపుట్టేవ్.

శ్యామ—మరి మాఅమ్మయేదండీ!

గోపీ—మీఅమ్మ కాదు మా శేఠాసీ. (కంగారుతో) నై. నై సెప్తాండండు.

శ్యామ—అంతకంగారుపడతా రెందుకండి. కొంచెం తమాయించుకొని చెప్పండి.

గోపీ—చూడు. బేటీ, గుండెల్ ఎలాకొట్టుకుంటున్నాయో.

శ్యామ—(చూచి) అబ్బ! ఏమిటండి యింతగాభరా పడతారు నాన్నగారు.

గోపీ—ఏమీ లేదు. శేఠాసీసంగతి హెత్తగానే, గుండెల్లో గుబుల్ గుబుల్ బయలు దేరింది. హిందుక్కా చేత విచారంవేసి మన్కి కంగారు వచ్చింది. (విచారించుచుండును)

(అంత లోన శబ్దమగును)

గోపీ—అరే బేటీ! కొంప మున్గిందిరా బాబు. దొంగముండా కొడుకుల్ రాబాబు. అరే పైసా పైసా రాం. రాం రాం. (అని కంగారు పడుచుండును)

శ్యామ—(యిటు నటు జూచి నవ్వుచూ) అదేమిటండీ. యిక్కడ దొంగలులేరండి. పిల్లి చప్పుడుచేసింది. అదిగో కళ్లు తెరచి చూడండి.

గోపీ—అరే. కాదురాబాబూ. సరిగ్గా చూడువోయి. హక్దవుంది యిన్నపెట్టి తీస్కుపోతున్నారు. అదిగో.

శ్యామ—యిక్కడ నేను తప్ప ఎవరూ లేరు కళ్లువిప్పి చూడండి. అరే. నాకూ కన్పడుతూంది. దొంగముండా కొడుకుల్ ముస్కుల్ హేస్కున్నారురా బేటీ. రాం రాం. (అని వణకుచుండును)

శ్యామ—మరేమి కంగారుపడకండి. దొంగలు లేరండి

గోపీ—అరే. ఆ మాట్లాడేది దొంగరాబాబూ.

శ్యామ—దొంగకాదండి. మీ అమ్మాయిని శ్యామలను.

గోపీ—ఆ మాట్లాడేది దొంగకాదు. శ్యామలా.

శ్యామ—అవునండి.

గోపీ—అయితే నేను సచ్చిపోయేనా ? బతికి ఉన్నానా ? బేటీ!

శ్యామ—అదేమిటండి అలా అడుగుతారు. నాన్నగారు. సుఖంగా ఉన్నారు.

గోపీ—చావలేదన్న మాట.

శ్యామ—ఆ!

గోపీ—దొంగ నిజంగా లేదూ అంటావ్.

శ్యామ—లేదు. కళ్ళువిప్పండి.

గోపీ—(బలవంతముపై కళ్ళువిప్పి యిటునటుజూచి తమాయించుకొని) అరే. హేంతగాభరాపడ్డా. నిజంగా దొంగలేడూ అంటావ్.

శ్యా—లేదు. యేదో పిల్లో, యెలకో చప్పుడు చేస్తే యింత హూడా విడేమిటండి.

గోపీ—హూడావిడి అంటావ్. నీకూ హేమీ తెలుసు. చప్పుఅవగానే అలాగ చూస్తే, ముసుగులు హేసుకుని దొంగలు పిస్టల్ వుచ్చుకొని నన్ను చంతివేసి పైసా తీసుకుపోయినట్లుఅయింది వోయి.

శ్యాను—డబ్బున్నవాళ్ళకు సహజమేయిది. పిల్లిచప్పుడుచేస్తే పిడుగు పడిందనుకుంటూరు.

గోపీ—ఛూ, హెదవ్వపిల్లి ఎంత గాభరాచేసింది.

శ్యామ—సరేగాని నావిషయం చెప్పండి.

గోపి—ఆ. సెప్తాం. ఉండు. (స్థిమితపడి) ఏమ్టీ కావాలి ?

శ్యా—నే నెవరి కూతుర్నో చెప్పండి. వేధించక.

గోపీ—ఎవరికూతురు. మన్కి కూతురు.

శ్యామ—కాదు, మీరేదో రహస్యం దాస్తున్నారు. నిజంజెప్పండి. లేకపోతే నేను పోతాను.

గోపీ—అరే. తుణంతుణానికి పోతాన్, పోతాన్ హంటావు. ఎక్కడికిపోతావ్.

శ్యామ—ఎక్కడికో. గంగలోకి.

గోపీ—గంగలోకి ఎడ్తావు. గంగాహెక్కడ ఉందిరే.

శ్యామ—నా నెత్తిమీద.

గోపీ—నెత్తి మీద హుంది. యింకాయేమి. అయితే నీవూ కర్ణుడన్నమాట.

శ్యామ—ఏదో వల్లకాట్లో రామనాథయ్య.
గోపీ—ఆ! వల్లకాట్లోరామనాథయ్యా! ఆంటే ద్రౌపద్కీ తమ్ముడ్ శంకరుడ్, అంతే నా బేకీ!
శ్యామ—మీరింతకూ చెప్తారా నన్ను పొమ్మంటారా!
గోపీ—హింతకోపం చేస్తే ఎలాగ. సెప్తాం. ఉండు.
శ్యామ—త్వరగా చెప్పండి.
గోపీ—నిజం సెప్తాం. విన్కో నీవు హింత ఉన్నప్డు హమ్మాబాబు సచ్చిపోయేర్. హప్డు నిన్ను తెచ్చి పెంచి పెద్దదాని సేసాం. నీకూ హింకా హెవ్వరు దిక్కులేరు
శ్యామ—హింతకూ మీరు నన్ను కనలేదన్నమాట.
గోపీ—కాదని యిదీవర్కే సెప్పాం.
శ్యామ—యీరహస్య యిన్నాళ్ళనుండి నాకు చెప్పలేదేమి?
గోపీ—సెప్తె గుండెపగిలి సస్తావు అని.
శ్యామ—అలాగా! (అని ఆలోచన నభినయించుచుండును.)
గోపీ—(దగ్గఱగా చేరి) బేకీ! బేకీ!
శ్యామ—ఏమండీ! నాన్నగారూ.
గోపీ—యిదిగో బేకీ! నీకు మంచిమొగుడ్నిచూచి పెళ్ళి చెయ్యాలని ఉందిరే.
శ్యామ—నాకు పెళ్ళి వద్దండి. నాన్నగారూ.
గోపీ—పెళ్ళిచేసుకోక యేమ్టీ చేస్తావు.
శ్యామ—నేను మనసారా వరించినవానికిచ్చి పెళ్ళిచేస్తారా!
గోపీ—హేమ్టీ. నీవు ప్రేమ చేసావ్. హెవరు రే వారూ?
(శ్యామల, సురేష్, పఠము చేతికిచ్చును.)
గోపీ—(చూచి) థూ. (ఫొటో పారవైచి) శీడ్కీనిన్ను హిచ్చిపెళ్ళి చెయ్యడమా. తిండ్కీ గుడ్కీ లేక ఆమాధవరావ్ పంతుల్

దగ్గఱ ఉన్నాడు వీడు. తాగుడు, పేకాట, ముండలు, ఒక్కటి యేమిటీ హీన్నీ ఉన్నాయి వీడ్కి వొద్దు. మంచి మొగుడ్ని చూసి చేస్తాం.

శ్యామ—తిండికి గుడ్డకీ లేక పోయినా, దుర్మార్గుడైనా అతన్ని తప్ప యింకెవర్ని పెండ్లి చేసుకోను.

గోపీ—(కోపముతో, బిగ్గఱగా) ఆ! చేసుకోవూ. చూస్తాం. సచ్చినాసరే. నిన్ను ఒక్కనాట్కి వాడికియిచ్చి పెళ్ళి చెయ్యను.

శ్యామ—అయితే చచ్చిపోతాను లెండి. (గొంతుక నులిమికొనబోవ)

గోపీ—ఆ! ఆ! ఆగువోయి. చేతి! ఆగు. ఎక్కడగొడవ తెచ్చి పెట్టావురాబాబూ. సరే. అలాగే చేస్తాం. (తనలో) పిల్లల్ లేకపోతే వీడపోయెగాని ఉంటే యిదే బాధ. హేమిట్రా చేస్తాం పెంచినప్రేమ.

శ్యామ—తప్పక చేస్తానని నాతోడు వేయుండి.

గోపీ—అలాగే, నీదితోడు, రాంజీతోడు. చాలా.

శ్యామ—చాలండి. చాలు. యివాళ నాకు చాలా సంతోషంగా ఉందండి. నాన్నగారూ.

గోపీ—అబ్బా! సినీమాకీ తయారయి ఉండు, మేము వెళ్తాం.

(నిష్క్రమించును.)

(తెరపడును.)

---

మూడవరంగము.

ప్రదేశము— పూలతోట.

ప్రవేశము—ఇందిరా, ప్రభాకరం

ప్రభా—దేవిగారు చాలా అలసినట్లున్నారు.

ఇంది—మరే. అలసి బావగారి ఒడిలో పడ్డారు.

ప్రభా—అలాగైతే కొంతతడవిచ్చట విశ్రమిద్దాము.

(యిరువురు కూర్చుందురు. ఇందిర ప్రభాకరుని వక్షస్థలముపై నాని యుండును)

ఇంది—బావా! మనకు కాల మెంత సుఖంగా గడచి పోతూంది. ఎప్పుడూ యిలాగే ఉంటుందంటావా బావా?

ప్రభా—తప్పక. కాని మీ యమ్మ మన ప్రణయమున కంతరాయము కల్గించునేమో యని అనుమానంగా ఉంది.

ఇంది—ఎందుచేత బావా?

ప్రభా—నేను బ్రహ్మసమాజంలో చేరినానని, మీ డబ్బంతయు వెచ్చించి. బి. ఏ ప్యాసయి యే ఉద్యోగము చేయకుండా సోమరిపోతునగుచున్నానని, అనాథుడనని, అభాగ్యుడనని నిన్ను నా కిచ్చుట కంగీకరించదేమో?

ఇంది—బావా! మా అమ్మతో లెక్కలేదు. నాన్నగారు మనఇద్దరిని దంపతులుగా చేస్తానని యెన్నోసార్లు నాతో చెప్పేరు.

ప్రభా—సరిగాని. యిందిరా! నిన్న అత్తయ్య నీతో ఏదో పెండ్లి విషయము మాట్లాడుచున్నది. ఎవరి సంగతి?

ఇంది—యింకెవరి సంగతి మనసంగతే. మా మేనమామ గోపాలాన్ని ఎరుగుదువా?

ప్రభా—ఆ! ఎఱుగకేమి. మూడుకాళ్ళ ముదుసలి.

ఇంది—అతడే. యీ మధ్యను వాని రెండో పెండ్లాము కూడా చని పోయింది. అందుచే మూడో పెళ్ళి చేసుకుందామని నిశ్చయించుకున్నాడుట.

—ఆ ముసలిపీనుగకు మూడో పెళ్ళా? రామ రామ మళ్ళా ఎవరి గొంతుక కోయడానికి సిద్ధపడుచున్నాడో!

ఇంది—నా గొంతుకే. అమ్మ, నన్ను రాణి కిచ్చి పెళ్లిచేయాలని, నాన్నను వేధిస్తూంది. నన్ను కూడ ఎన్నోసార్లు అడిగింది. నేను చేసుకోనని ఖచ్చితంగా చెప్పేను.

ప్రభా—యింకేమి. యిందిరా! నిర్ధనుడను, నిరుద్యోగిని, అనాధుడను యిట్టి నాకు, నిన్ను శ్రీమంతుని కిచ్చుటమాని పెండ్లిచేయుదురా? అట్లయిన నా ఆశాలత త్రెంపబడునేమో!

ఇంది—బావా! ఏల పిరికిపందవలె మాట్లాడెదవు? హృదయపూర్వకముగా నీకర్పించిన యీ ప్రేమకుసుమమును తుంచివేయుటకు బ్రహ్మరుద్రాదులకైనను తరముకాదు. ఏనాడో నాజీవితమును నీకు అంకితముచేసాను. నీవు లేని నాజీవితము కారుమబ్బులు కమ్మినవినీల ఆకాశము వెన్నెలనుండి చల్లదనాన్ని వసంత కాలములో కోయిల గొంతులోనుండి దాని మధురగీతిని, పూవులోనుండి తావిని వేరుచేయగలరా? అలాగే నిన్ను నా పవిత్ర హృదయమునుండి వేరుచేయలేను.

ప్రభా—ఇందిరా! నీ హృదయ మెంత ప్రేమపూరితమైనది. నిన్ను భార్యగా బడయగల్గే నా భాగ్యాన్ని ఏమని వర్ణింపను? (అని ముద్దిడును)

ఇంది—ఉండు. బావా ఉండు. పురుషులు మోసకారులు. వారిని నమ్మితే గంగలో దింపుతారు.

ప్రభా—ఓహో యిప్పటి స్త్రీలు మాత్రము సామాన్యులా?

ఇంది—ఏమి. స్త్రీలకేమి.

ప్రభా—అయితే యిప్పటి స్త్రీల సంగతి చెప్తాను. విను.

సీ. యీ వినింగవగాని ♦ యింపైన సోవుతో
క్రీముతో మేనును ♦ క్లీనుచేసి

స్నోలు పౌడర్లతో ♦ షోకు చెలాయించి
బాడీలు డ్రాయర్సు ♦ బాగ దొడగి
కండ్లకు స్పెటికల్సు ♦ కాళ్ళకు స్లిప్పర్సు
వేనిటీ గుహా ♦ స్తానబాల్చి
ప్రాణనాయకుఁదన ♦ పాదదాసునిఁ జేసి
పరులతో విహరించు ♦ పడతి యొకతె

గీ. భర్త తగదంచు బల్కిన ♦ భయము వీడి
వడిగ పిడియాకు లిచ్చెడి ♦ వనిత యొకతె
యిట్టులున్నారవనియందు ♦ యింతులిచట
పాపమున్నదో? లేదో? యీ ♦ భామల కహా

ఇంది—ఆ! యెలాగైనా స్త్రీలకన్న, ఎక్కువ పురుషులకే పాపభీతి లేదు. పురుషులే ఎక్కువ వ్యభిచారులు. పరస్త్రీని చూచి నంతనే దానికై ప్రాకులాడుతారు. అందులోనూ యీకాలపు వారు మరీని. నమ్మించి గొంతుక కోస్తారు.

ప్రభా—వెర్రిదానా! పూర్వకాలంవారికే కాంతావ్యామోహము ఎక్కువుంటే యీకాలమువారికి ఉండడము ఆశ్చర్యమా? చూడు.

సీ. ఘన తపశ్శాలి యా ♦ గాధి కుమారుడే
మేనకన్ జూచిఁ భ్ర ♦ మించి చెడెను
శ్రీయుత విప్రనా ♦ రాయణ భక్తుడు
వెలకాంతఁ గూడియె ♦ వెతలబడెను
పరులభార్యను గోరి ♦ ప్రథిత శచీపతి
గౌతమ శాపమున ♦ కనులు గాంచె
ఋష్యశృంగుని వంటి ♦ ఋషిసత్తముండును
తరుణికి దాసుడై ♦ వరలలేదె?

గీ. యింతికన్నులబడకయు ♦ న్నంతవఱకె
సిద్ధులును, సాధ్యులును మరి ♦ శేముషులును
నారిహాయులను గాంచి సు ♦ ధీరులైన
మోసపోవుట నిజమడి ♦ యాసకాదె?

ఇంది—ఓహో! యీభావకవిత్వ మెక్కడ నేర్చుకుంటున్నావు?

ప్రభా—యిందిరా! నేను మెచ్చటనో నేర్చుకొన నక్కరలేదు. నీ సుందరముఖారవిందమును చూడగనే దానంతటదే పొంగి పొరలి వస్తూంది.

ఇంది—అబ్బా! నాముఖంలో అంత మహాత్మ్యమున్నది గాబోలునే?

ప్రభా—స్తుతిగాదు. ఇందిరా! నీ సౌందర్యాన్ని నీవు గుర్తించుకో లేవు. నీమనోహరరూప మీస్వష్టికొక పెట్టని యలంకారము. నీశక్తిని నీవు గ్రహించుకోలేకపోవడం సహజం. నీచూపుల్లో స్వర్గీయానంద మున్నది. ఆస్వర్గీయానందమును తనివితీర అనుభవించనియ్యి యిందిరా. (అని కౌగలించుకొనబోవును.)

ఇంది—చాల్లే బావా! కొంటిపనులు. (అని కొంచెము దూరముగా బోవును)

ప్రభా—ఓహో! కోపమొచ్చిందా. యిందిరా! యిలా చూడు.
(తాకబోవ)

ఇంది—(విడలించుకొని) నాతో మాటాడకు.

ప్రభా—పోనీలే. యింకెందుకు నేనిక్కడ వెళ్లిపోతానులే.
(పోబోవును)

ఇంది—(పోవుచున్న ప్రభాకరు నాపి) అబ్బా! ఎంత కోపం. వేళా కోళానికన్నా కోపమేనా? రా బావా!

ప్రభా—ఊహు, నేను రాను.

(యిందిర బ్రతిమాలుచుండును. ప్రభాకరం విదలించుచుండును. అంత సురేష్ మరియొకప్రక్కను ప్రవేశించి, పోబోవుచూ తటాలున ఆగి వెనుకకు తగి, ఇందిరాప్రభాకరుల జూచి)

సురే—ఓహో నాయకీనాయకులు ప్రేమ సల్లాటలలో ఉన్నారు కాబోలును. యిచ్చట పొంచియుండి సర్వము కనిపెడతా.

(ప్రక్కగా పొంచియుండును)

ఇంది—(ప్రభాకరునకు ఎదురుగా వెళ్ళి నామీద కోప మొచ్చిందా బావా?

ప్రభా—(నవ్వి) వెర్రిదానా! నీమీద కోపమా? (అని చేయి పట్టు కొని) యిందిరా! యీప్రణయసామ్రాజ్యానికి నేను రాజును, నీవు రాణివి ఎన్ని అంతరాయములు కల్గినను, నిన్ను నేను! నీవు నన్ను, మరువకూడదు. !ఏదీ ఒక్క తీయని........

(అని ముద్దుపెట్టుకొనబోవును)

సురే—యిదే మంచిసమయము.

(అని దగ్గుచు ముందుకువచ్చి, వారికెదురుగా పోవును. వారు తటాలున విడిపోవుదురు.)

ప్రభా—ఓహో! సురేష్‌బాబు. Good evening

సురే—Good evening నా రాక మీ యానంద సాగరమున కానకట్టేమో?

ఇంది—యిట్టి అడ్డంకులను లెక్కచేసే దెవరు? తాటాకుల చప్పుడికి కుందేళ్ళు బెదురుతాయా? గ్రామసింహం మొరుగుతుంటె సింహం లెక్కచేస్తుందా? యింతకు నీవు వచ్చినపని?

సురే—బాబయ్యగారు యింట్లో కనబడలేదు. తోటలో ఉన్నారేమో అని వచ్చాను.

ప్రభా—నీవు వచ్చినపని అయినదా?

ఇంది—అయితే వెళ్ళవచ్చు.

సురే—మంచిది.

ప్రభా—అయ్యో! సురేష్‌బాబుగారూ!

ఇంది—త్వరగా దయచేయుండి.

(సురేష్ తలవంచుకొని మరియొక ప్రక్కకు వచ్చి పొంచియుండును)

ఇంది—బావా! యీతడు మన కొక శనిగ్రహమువలె దాపురించినాడు. తన్ను ప్రేమించుమని నన్నెన్నోసార్లు నిర్బంధించినాడు. ఒకసారి చెంపదెబ్బ కూడా తిన్నాడు.

ప్రభా—ఆడుదాని హృదయము గ్రహించుకోలేని మూర్ఖుడువానితో మనకేమి ?

ఇంది—వీనికైనపుడెల్ల అవమానపరచుచున్నను సిగ్గులేదు.

ప్రభా—మొండి బ్రతుకు.

సురే—(తనలో) ఏమీ నాది మొండిబ్రతుకా? మూర్ఖుడనా? నాకు సిగ్గులేదూ? సరే నాతడాఖా చూపిస్తానుండు. కంగారుపడకు.

(నిష్క్రమించును)

ప్రభా—ఇందిరా! మన యానందమున కడ్డుతగిలినాడు. ఏదీ ముద్దు. (దగ్గఱగా తీసికొనును)

( తెర పడును )

---

## నాల్గవరంగము

ప్రదేశము : గృహాంతర్భాగము.

(ప్రవేశం—సురేష్, శేఖరం)

శేఖ—(త్రాగుచు మిత్రమా! యీనాటికైనా నీకు బ్రాందీమహిమ బోధపడినదా ?

సురే—సోదరా! నీదయవలన రకరకాలబ్రాందీని రుచిచూడ కలుగుచున్నాను. పెధవచదువుకు స్వస్తి చెప్పాం. యిప్పుడెంత happy గా ఉంది. ఆఫీడరుఫీనుగ చదువుకని ఇచ్చేడబ్బు peg కు ఖర్చు పెడుతున్నాం.

శేఖ—మనం చేసేపని దేవుడు మెచ్చుతాడురా, చదువు చదువని చంపుతారు. ఎందుకొచ్చిన చదువు. అనేక వేలమంది graduates కాఫీహోటల్సులో పనిచేస్తుండగా మనం చూడటంలేదుటూ.

సురే—Right నీవు చెప్పినది నిజం. యీ education కి ఖర్చు పెట్టే డబ్బు మనలాగ పెగ్గుకు, పేకాటాకు, సిగరెట్సుకు, నూట్సుకు ఖర్చుపెట్టమని students అందరికీ మన advice ఏరా! అంతేనా!

శేఖ—ఓ. ముమ్మాటికి. కాని ఫ్రెండ్! peg కి తోడు ప్రక్కన lady కూడా వుంటె............

సురే—ఆహా! స్వర్గమురా!

శేఖ—నీకేమిరా. చక్కనిపిల్ల శ్యామలను సంపాదించేవు. అదినిన్ను తప్ప అన్యుని పెళ్ళాడనంటూందట.

సురే—పాడుముండ. దానితో నాకేమిరా. అంతకంటె అందమైన దుందిరా.

శేఖ—ఓహో క్రొత్తపిట్ట చిక్కిందన్నమాటే. ఎవరది ?

సురే—ఎవరోకాదు. మాధవరావుకూతురు. ఇందిర.

శేఖ—అది ప్రభాకరాన్ని love చేస్తూందని విన్నానే. మరి నీకేలా దక్కింది.

సురే—అదేరా గొప్పచిక్కు. ఎన్నోసార్లుప్రయత్నించాను. వీలు పడిందికాదు. చెంపదెబ్బకూడా కొట్టింది. చాల అవమాన కరంగా ఉందిరా.

శేఖ—(బిగ్గరగా నవ్వి) ఓరి, చవట చెంపదెబ్బ తిన్నా ఊరకొన్నా వట్రా! అదే నేనయితే యీపాటి కా కుటుంబాన్నంతటిని సర్వనాశనం చేసెయ్యనూ ?

సురే—ఆ! అదే. అదే. చేయాలని ఉందిరా. ఏలాగైనాసరె ఇందిర నపహరించి ఆకుటుంబంలో చిక్కు కలిగించాలిరా.

శేఖ—నీకు తప్పకుండా చేయాలని ఉందా ?.

సురే—Certainly.

శేఖ—అలాగైతే ముందరొక drop నోట్లో వేసుకుంటేనేగాని idea strike అవదు. రాని.

(యిరువురు త్రాగుదురు)

సురే—(త్రాగుచూ) నిజం. యిది లేనిదే ఏపనీ జరుగదు.

శేఖ—అందుకనేగా అలవాటు చేసుకొన్నది. ఆఉపాయం చెబుతాను విను. (ముందుకు తీసికొనివచ్చి) ఏమంటావు. యిందిర నపహరించాలి. ఆకుటుంబాన్నంతా పాడుచెయ్యాలి. యిలా విను.

(అని చెవిలో చెప్పును)

సురే—(ఉలికిపడి) అమ్మయ్యో! పెద్దప్రాణానికే పెట్టేవు. మాధవరావు లేనిచో ఆకుటుంబము రెక్కలువిరిగిన పక్షిలాగ అవుతుంది కాబట్టి అతన్ని చంపేసి యిందిరను తస్కరించుకొనిరావడమా?

శేఖ—ఉస్. గొడవపెట్టకు మరో peg తగిలించు (మరల త్రాగించి) యిదిగో సురేష్ నేను చెప్పినట్లు చేసితివా నీకు అన్ని దక్కుతాయి. లేదా నీవొక అసాధ్యవై ఎప్పుడు మూలనుండవలసినదే, బాగా ఆలోచించుకో.

సురే—అదికాదురా! Murder అంటె సామాన్యముకాదా, కొంప దీసి దొరికిపోతామేమో అని.

శేఖ—నీకటువంటి అనుమానంవద్దు. నేనున్నానుగా యిటుచూడు. మనం murder చేయుడానికి ముందుగుండు సామానుగాని, ఆయుధసామగ్రికాని ఏమీ ఉపయోగించవద్దు. నిశ్శబ్దముగా యిందిరా, మాధవరావులకు 'క్లోరోఫారం' ఉపయోగించి అంకింది తస్కరించి తుపాకీదెబ్బకు పరారైపోదాం. దీనివలన సునాయాసంగా యిందిరా మాధవరావులు చేజిక్కుతారు.

సురే—భేష్. చక్కని ఉపాయం చెప్పేవురా. దీనివలన మనకు Pegకి పైసా, ప్రక్కన యిందిరా లభ్యమౌతుంది. మాధవరావును

చంపడంవల్ల ఆకుటుంబంమీాద కసితీరుతుంది. పైకి యీపని మనంచేసామని అల్లరవదు.

శేఖ—మరియీా శేఖరం అంటే ఏమనుకున్నావు? నేను చెప్పినట్లుచేస్తే నీఅదృష్టానికి కొఅత ఉంటుందా? అప్పుడు మేము కనిపిస్తామో కనిపించమో దొరగారికి.

సురే—ఎంతమాట. నిన్ను మరచిపోతానటరా? నీవునాగురుదేవతవు

శేఖ—(ముందుకువచ్చి తనలో వెర్రిపీనుగ నావలలో చిక్కినాడు. వీని నెపైనను ప్రోత్సహించి, మాధవరావును చంపించి, సర్వ సౌఖ్యాలను పొందాలి. Two birds at one shot యీా దెబ్బతో కాంతా, కనకాలు రెండూ లభిస్తాయి.

సురే—శేఖరం ఏదో ఆలోచిస్తున్నట్లున్నావే.

శేఖ—ఏముంది నీగొడవే. ఎప్పుడు నిన్ను సౌఖ్యడోలికల తేలిద్దామా అని. ముందుపానీయము రానీ. (యిరువురుమరలత్రాగుదురు)

సురే—ఎప్పుడోనా! యీారాత్రే సర్వము కానిచ్చేయాలి ఆలస్యం అమృతం విషం.

శేఖ—భేష్! యిప్పటికి నీకు బ్రాందీనిషా బుర్రకెక్కిందిరా. ఆమాత్రం ధైర్యం వచ్చిందికదా చాలు.

సురే—నీవు నాప్రక్కనుంటే ధైర్యాని కేమిలోటు.

శేఖ—నిజం గ్రహించేవు కాని యీాయాగానికి మన మిద్దరము చాలము. యింకొనలుగురైదుగురు కావాలి. వాళ్ళకు పైసా...

సురే—వెధవపైసా. సందేహిస్తావెందుకు. యిదిగో నాదగ్గరఉన్నది తీసుకో. (నోట్లిచ్చును)

శేఖ—యింకనేమి? అయితే త్వరగాలే తగు ప్రయత్నంలో ఉందాం.

సురే—ముందు కులదేవతపూజ చేయకుండానే.

శేఖ—సరే కానియ్యి. (యిరువురు త్రాగుచుందురు)

(తెర పడును)

---



# మేనరికం

## ద్వితీయాంకము

### మొదటి రంగము

ప్రదేశము : ప్లీడరుగారియిల్లు

ప్రవేశము : దుర్గాంబ

దుర్గ—అబ్బబ్బ! యిప్పటికాలం పిల్లలకి బొత్తిగా చెప్పలేకుండా ఉన్నాముగదా! కాకపోయినా కాలము చాలామారిపోయింది.

సీ. శాంతమూర్తియైన ♦ సర్వసిద్ధార్థుని
శాంతమ శబ్దంబు ♦ సమసిపోయె
ధర్మశీలురునైన ♦ ద్వాపరజనులతో
ధర్మమన్ శబ్దంబు ♦ దప్పిపోయె
కర్ణభూపాలాది ♦ ఘనసుదాతలతోనె
దానమన్ వచనంబు ♦ దరలిపోయె
జ్ఞానమూర్తులు ఋషి ♦ చంద్రులతోడనె
విజ్ఞానతేజంబు ♦ విచ్చిపోయె

గీ. జాతిమతవివక్షతలింక ♦ జారిపోయె
వంశమర్యాదలన్నియు ♦ వాసిపోయె
తల్లిదండ్రులం దణకువ ♦ తొలగిపోయె
నేడు జగమధర్మముతోడ ♦ నిండిపోయె.

ఆవర్ణసంకరపు పీనుగను పెళ్ళిచేసుకోవద్దని ఎన్నిసార్లు చెప్పినా ఇందిర వినడంలేదు. భల్లూకపుపట్టుపట్టింది. గదిలో చదువుకుంటూన్న ట్లుంది. కడసారి ప్రయత్నించిచూస్తాను. (పైకి) అమ్మాయి ఇందిరా ఇందిరా.

ఇంది—(చేతిలో పుస్తకముతో ప్రవేశించి) ఏమే అమ్మా!

దుర్గ—యిలారాతల్లీ. కూర్చో.

ఇంది—(కూర్చుండును)

దుర్గ—తల్లీ! మూర్ఖపుపట్టు పట్టక నామాటవిని, ఆకులభ్రష్టుని మానేసి. నీమేనమామను పెండ్లియాడు. కావలసినంత ఆస్తి. యిదుగో! యిరామూడు. వానికే ఎవరు వెనుకదిక్కు లేరుకదా? నామాటవిని పెండ్లి చేసుకున్నావంటే అన్నవుఆస్తి యీఆస్తి వుఆస్తి అంతాకలిసి నీకేదక్కుతుంది.

ఇంది—అమ్మా! ఎందుకునన్ను బాధిస్తావు. మనసారవరించినవానిని వదలి పాడుఆస్తికోసం ముసలివగ్గాసును పెండ్లియాడమంటావా తల్లీ. మనకున్న యీఆస్తి చాలదూ? యింతకు బావలో యేలోపముందని పెళ్ళిచేసుకోవద్దంటావు.

దుర్గ—అమ్మాయి! నాకుకూడ నినాతనికిచ్చి పెండ్లిచేయాలని ఉండేది. కాని యిప్పుడాతను హద్దుమీరినడుస్తున్నాడు. అన్ని దురాచారాల్లోను ఆరితేరాడు ఆబ్రహ్మసమాజంలోకి వెళ్ళ వద్దని నేనెన్నిసార్లు చెప్పినా విన్నాడా? అటువంటి కులభ్రష్టు నికా నిన్నిచ్చుటతల్లీ.

ఇంది—తల్లీ బావయందు లోపముంటే నాన్నగారు ననాతనికీయ డానికి కెందుకొప్పుకుంటారు? అమ్మా! చిన్ననాడే మా యిరువురిహృదయములందు ప్రేమబీజములు నాటబడి దిన దినాభివృద్ధి నొంది నేటికి మహావృక్షములై, శేషో మాపా

ఫలములు వేయడానికి సిద్ధంగా ఉన్నాయి. వానిని కూకటి వ్రేళ్ళతో పెల్లగించటం నీకు యుక్తమా తల్లీ!

దుర్గ—అమ్మాయీ యిటు చూడు. నీ మేలుకోరి చెబుతున్నాను. అతనికి ఒక చిల్లిగవ్వయినా లేదు. చిన్నవాడు మీనాన్నగారు చేరదీయకపోతే యీపాటి క్షేమయుండునో. నిర్ధనుడు, నిరుద్యోగి, కులభ్రష్టుడు. అటువంటి వానిని పెండ్లియాడి నీ వేమి సుఖపడతావు తల్లీ.

ఇందిరా—అమ్మా! అనుకూలదాంపత్యము ప్రధానముకాని నీ కాస్తియా ప్రధానము. సిరి చంచలము. సిర్ధనుడైనను, అనుకూలుడైన పతితో భిక్షమెత్తుకొనియైనా బ్రతుకవచ్చును. కనుక నాహృదయ పూర్వకముగా ప్రేమించిన ఆ ప్రభాకరాన్నితప్ప యితర పురుషుని పెండ్లియాడను.

దుర్గ—ఏమే ఇందిరా! మర్యాదగా చెప్పుతూన్నకొద్దీ పొగరుబోతుతనము ఎక్కువౌతూందే. ఏమిటా పెంకిపట్టు నిన్ను వాడికివ్వడం కలలో వార్త.

ఇందిరా—తల్లీ మనసు లేని కాపురం అనర్థదాయకం. నన్ను నిష్కారణముగా కష్టాల పాల్జేయకు తల్లీ.

దుర్గ—(కోపముతో) నువ్వింక యెంత ఏడ్చినా ప్రయోజనము లేదు. నా మనస్సు తిరిగిన తర్వాత త్రిమూర్తులొచ్చి చెప్పినా వినను. నీవు తప్పక నీ మేనమామను పెండ్లియాడి తీరాలి.

ఇందిరా—తల్లీ! నా కడసారి మాట విను. ఆ ప్రభాకరునిపై

ఉ. మానసమేలకో నిలచె ♦ మాన్పగ నాతరమా యికేల నీ
దానను నేను గాద నెద ♦ తామసమున్ సహాయింప జూడకన్
దాన ననేక కష్టములు ♦ దాపసమాను నిజంబుగానికన్
నే నణుమాత్రమేని విన ♦ నేల వృథాశ్రమ మానుమమ్మరో!

దుర్గ—నీయాటలు నాదగ్గఱసాగవు, ఏమిచేస్తావో చూస్తాను రేవు రాబోయేముహూర్తానికి సిద్ధముగా ఉండమని నీ మేనమామ కిప్పుడే ఉత్తరం వ్రాయిస్తాను. చిలుకకు చెప్పినట్లు చెప్తేవిం టున్నావుగావు. నీ తెగులు బాగా కుదురుస్తానుండు.

[మాధవరావు ప్రవేశం]

మాధ—ఏమి లేన్. ఎవరికి తెగులొచ్చింది. కుదురుస్తానంటున్నావు.
(పై నున్న కండువాతీసి కూర్చుండును)

ఇంది—(తండ్రి దగ్గఱకు చేరి) నాన్నగారూ! చూడండి. మామయ్యను పెండ్లిచేసుకోమని నన్ను నిర్బంధిస్తోంది అమ్మ. రేవు ముహూర్తానికి సిద్ధంగా వుండమని మామయ్యకు letter వ్రాయిస్తుందట.

మాధ—అలా యెన్నటికీ జరుగనీయను. ఊరుకో తల్లీ! (భార్యను జూచి) ఏమే నీకెన్నిసార్లు చెప్పేను. దాని నా విషయంలో బాధించవద్దని. బుద్ధిలేదూ.

దుర్గ—అదిగో మీరలా వెనకేసుకు రాబట్టే అదలాగ తందనా లాడుతోంది.

మాధ—చాల్లే. నిన్నెవరు కలుగచేసుకోమనలేదు. పోయి పడుకో.

దుర్గ—నాకెందుకు లెండియీాకంఠశోష, ఏకష్టమొచ్చినా భరించేది దే. ఎవరి కర్మ వారిది. (నిష్క్రమించును)

మాధ—(కుమార్తెను చేరదీసి) అమ్మాయీ! నీవు విచారించకు. నాకంఠంలో ప్రాణముండగా నిన్ను ప్రభాకరానికితప్ప మరొకరి కిచ్చి పెండ్లి చేయను. ఎన్నటికైనా మీాయిద్దరినే దంపతులుగా చేస్తాను.

ఇంది—నాన్నగారూ! యీామాటమీాదనే ఉంటారా?

మాధ—తప్పక తల్లీ! పోయి హాయిగా పడుకో. విచారించకు. అప్పుడే రాత్రి 11 గంటలయింది. లే. త్వరగా పడుకో. నేనూ యిక్కడే పడుకుంటాను.

ఇంది—అమ్మయ్య. ఇప్పటికి నా హృదయము కుదుటబడింది. (అని మంచముపై బరుండును.)

మాధ—వెర్రిపిల్ల. ప్రభాకరం అంటే యెంతప్రేమ. పరమేశ్వరా! ఏది ఎటుల చేయదలంచితివో గదా! (అచ్చటనే మరొక మంచముపై పరుండును.)

(అంత నలుగురు మనుష్యులు ముసుగులుధరించిప్రవేశింతురు. యిరువురు, యిందిరా మాధవరావుల మంచములయొద్దకు పోయి 'క్లోరోఫారం' నుపయోగింతురు. వారు కొంతసేపిటునటు ఒత్తిగిలి మత్తెక్కి పడిపోవుచుందురు. చంద్రశేఖరం యినుపపెట్టె తెరచి డబ్బు మూటగట్టుచుండును. సురేష్ . పలా కాయుచుండును. యిందిరా మాధవరావులను తీసికొనిబోవ ప్రయత్నించు చుండగా)

(తెరపడును)

— —

## రెండవరంగము

ప్రదేశము : మార్వాడీవాని యిల్లు.

(ప్రవేశం : శ్యామల)

శ్యామ—(విచారముతో) ఆహా! నా ప్రియుడు డీవిధముగా అగునని కలలోకూడ తలంచలేదుకదా! నేనెన్నిపర్యాయములు కబురంపినా ఒక్కసారికూడా రావడములేదు. దుర్మార్గుడు చంద్రశేఖరమే సురేష్‌ను యింతపనిచేసేడు.

(అంత సురేష్ పాడుచు ప్రవేశించును.
శ్యామల లేచి నిలచి యుండును.)

సురే—ఓహో! యీవాళ శ్యామలాదేవిగారు పతివ్రతాపద్ధతుల నవలంబించేరు కాబోలు నే.

శ్యామ—రా! సురేష్! రా యిలా కూర్చో. (కూర్చుండచేయును)

సురే—మంచిది. (సిగరెట్టు ముట్టించి) ముందొక పెగ్గు బిగించనియ్యి (అనుచు బ్రాండీ సీసాను తీయును.)

శ్యామ—(బ్రాండీ సీసాను లాగుకొని) అయ్యో! ఎంత నీచపు పనికి పాల్గొనుచున్నావు. సురేష్ విద్యాధికుడవు. యీమాత్రం జ్ఞానము నీకు లేదా?

సురే—(వికటముగా నవ్వి) అట్టయిన యీ జ్ఞానహీనునకు జ్ఞానోపదేశము చేయ తను రవతరించినారు కాబోలు నే.

శ్యామ—ప్రియా! ప్రాయమువచ్చినవాడవు. నీకొకరు చెప్పవలెనా? మహానుభావుడా మాధవరావుగారు చదివిస్తుంటే చక్కగా చదువుకొనక యీ త్రాగు డేమిటి చెప్పు సురేష్. వంశగౌరవము పాటింపవా? పశుప్రాయుడ వగుదువా? నామాట విను. ఆచంద్రశేఖరం స్నేహము మానెయ్యి.

సురే—వెర్రిదానా! నీవు నాకు చెప్పాలా! నీకా శేఖరం గుణము తెలియదు. ఎంత మంచివాడు.

శ్యామ—అతని మంచితనము, నీ మంచితనము తెలుస్తూనే ఉంది. నామాట విను. ఏ దుర్గుణము లేని నిన్నేలా తయారుచేసాడో చూసావా? యిప్పటికైనా బుద్ధి తెచ్చుకో, త్రాగుడుమానెయ్యి.

సురే—Shut up ముందు బ్రాండీబాటిల్—ఊఁ!

శ్యామ—సురేష్! నీవు బ్రాండీమత్తుచే కన్నుమిన్నుగానక యున్నావు.

ఈమిత్రుడు నిన్ను సర్వనాశనం చేస్తాడుసుమా నిద్రనుండి మేల్కొ. భవిష్యత్తు నాలోచించుకో.

సురే——హి. హి! హి! హి! యెంత యుపన్యాస మిచ్చేవు. అలసినట్లు న్నావు. కొంచెము బ్రాందీతాగుదువు కాని ఊఁ బాటిల్.

శ్యామ——సురేష్! యీ మద్యపానమును విడచిపెట్టు దీనివలన.

గీ. సిరితొలంగు సంసారముల్ ♦ చిదికిపోవు
పరువు నశియించు నిందయున్ ♦ బాపమబ్బు
అలతి కులగౌరవము నడు ♦ గంటు గాన
మతి తిరుగ మద్యపానము ♦ మానుమయ్య.

ఈమద్యపాన నిషేధముకొఱ కనేకమంది దేశనాయకులు పాటుపడుచుండిరి. ముఖ్యముగా, మన మెవ్వనికులదేవతగా పూజిస్తామో, యెవ్వని ఖ్యాతి ప్రపంచమంతయు వ్యాపించినదో అట్టి శ్రీ గాంధిదేవుడే మద్యపానమువలదని ఆజ్ఞాపించేను.

సురే——(నవ్వి) ఏమి గాంధీమహాత్ముడా! యెవడువాడు? ఒక ముసలి యాజ్ఞాపిస్తె వాడి యాజ్ఞలు శిరసావహించాలా?(మరలనవ్వి) గాంధి మహాత్ముడు!

శ్యామ——అయ్యో! సురేష్! పొరబడుచున్నావుసుమా. అతడు ముదుసలియా, కాదు, అతడు ——

సీ. ఉచితవేదముల సాం ♦ గోపాంగముగ నేర్చి
సారమెరింగిన ♦ ధీరుడతడు
హరిజనుల వెతల ♦ బరిపూర్ణ్వగ దలంచి
ప్రతినల గైకొన్న ♦ ప్రముఖు డతడు
ఆడంబరములేక ♦ యాదర్శమై బాల
మెప్పులు వడసిన ♦ మేటియతడు
మాతృదేశమునకై ♦ మానాభి మానముల్
గలిగి యిక్కటులొందు ♦ ఘనుడతండు

గీ. శమదమాది గుణంబుల ♦ చనెడివాడు
పుణ్యశీలుడు విజ్ఞాన ♦ మూర్తి యతడు
యనఘ గాంధీమహాత్ముడే ♦ యానతిచ్చె
మద్యపానము వలదింక ♦ మానుమయ్య.

సురే—నిన్నధికముగా ప్రసంగించవద్దని యిదివఱకే చెప్పేను. ఊ రానీ బాటిల్.

శ్యామ—ప్రియా నా మాటవినవా ? నీ నిశ్చయమును మార్చుకొనవా ! శేఖరం స్నేహమును మానవా ? అతడు తేనె పూసిన కత్తిసుమా ? వానిని చేరదీయడం పాముకు పాలు పోసి పెంచడంవంటిదిసుమా. సురేష్ నామాటలు వ్యర్థం చేయకు.

సురే—వ్యర్థంచేయడ మెందుకు. ఒక peg Brandy తీసుకో.

శ్యామ—సురేష్! నామాట వినవా.

సురే—నీవధికంగా ప్రసంగించినకొలది నాకు కోపమెక్కు వవుతూంది. నాతుదినిశ్చయము చెప్తాను. విను.

గీ. జగము కంపించి సర్వము ♦ జనినగాని
సప్తసంద్రంబు లేకమై ♦ సాగుచున్న
స్నేహవర్గమును విడశా ♦ సినను గాని
బ్రాందిని వదలియుండ నే ♦ బల్కు లేల ?

యిదే నా తుది నిశ్చయము.

శ్యామ—సురేష్! నీ నిశ్చయమును మార్చుకొనవా ?

సురే—ముమాటికి మార్చుకొనను. ఈ వేళ నాకు చాలా ఆనందంగా ఉంది. నాఆనందానికి అడ్డురాక ఆ బాటిల్ రానీ, ఊఁ

శ్యామ—మీ ఆనందమునకు కారణము ?

సురే.—ఏముంది. ముసలిపీనుగ మాధవరావును Murder చేసి, ఇందిర నపహరించేను. (నవ్వి) ఆ కుటుంబముపై కసితీర్చి కొన్నాను.

శ్యామ—(చెవులు మూసుకొని) రామ. రామ. నిన్నాదరించిన యా మాధవరావుగారి కుంటుంబాన్నే ధ్వంసముచేసావా? కన్నతండ్రి వంటివానినే చంపేవా?

సురే—(నవ్వుచు) ఆ. యిన్నాళ్ళనుండి చదువు చదువని నన్ను చంపిన ఆముసలిపీనుగనే. నన్నవమానపరచినందుకు యిందిరకు తగిన శాస్తి చేసాను. దుర్గాంబబ్రతుకధోగతిపాలుచేసాను. (మరల నవ్వి) యీ సురేష్‌కుమార్ ప్రజ్ఞ చూపించేను. యింక ఆ యింట్లోంచి ప్రభాకరాన్ని కూడా వేరు చెయ్యాలి.

శ్యామ—అయ్యో. యీ సంగతి వింటే లోకు లేమంటారు?

సురే—ఏమంటారు. బ్రాందీబాటిల్ యిమ్మంటారు. ఊఁ రానీ.

శ్యామ—సురేష్! నిన్నింతవఱకూ తెచ్చినదీ బ్రాందిదే. యీ వేళ నీవు నాప్రాణము తీసినాసరే యీ బాటిల్ యివ్వను.

సురే—యివ్వవా! మర్యాదగా అడుగుచున్నాను. చిన్ననాటి స్నేహితురాలవని class mate వని ఆలోచిస్తున్నాను. ఊఁ యియ్యి.

శ్యామ—సురేష్! నీవు నన్నేమిచేసినాసరే. బాటిల్ యివ్వను.

సురే—ఈ సురేష్‌తో శత్రుత్వము వలదు సుమా! యిచ్చెయ్యి.

శ్యామ—ముమ్మాటికి యివ్వను.

సురే—ఎందుకివ్వవో చూస్తానుండు. (అని శ్యామలను చెంపదెబ్బ కొట్టగా పడిపోవును. సురేష్ బ్రాందీబాటిల్ లాగుకొని, విప్పి నవ్వుచు త్రాగి) స్వర్గసుఖము. తెలియని మూర్ఖులు యిది మంచిది కాదంటారు. ఒక్కసారి రుచిచూస్తే వదలిపెడతారా

(మరల నవ్వులు, త్రాగుచుండును యింతలో గోపీచంద్ ప్రవేశించి)

గోపీ—గడబిడా క్యారే. (సురేష్‌ను జూచి) అరే. బాపురే బాప్. (అని వెనుకకు తగ్గి) ఓహో! చవటముండాకొడుకు తాగి వొచ్చేడు. నా ప్రాణాలమీదికి వచ్చింది. యీడికి మంచి మాటల్తో సాగనంపాలి. (ధైర్యము తెచ్చుకొని) ఎవరండీమీరు

సురే—అరి ! ముసలితొత్తా. నేనెవడినో కనబడటంలేదురా? కళ్ళకి రోగం వచ్చిందా? బాగుచేస్తానుండు.

(గోపీచంద్ పైకివెళ్లిపోవును)

గోపీ—అరే తెరోగి. తెరో. ఓ సురేష్ బాబు నమస్తే నమస్తే దయ చేయండి. చాలా కాలానికి వచ్చారు.

సురే—(నవ్వి) అలా మర్యాదగా మాట్లాడు. నీగుమ్మంతొక్కమంటే తొక్కతాము రా మేము, మమ్మల్ని మర్యాదచేయకపోతే ?

గోపీ—(లోన) ఈలాంటి చవటానుండాకొడుకుల్ రాకపోతే మాకు లోటువచ్చింది. (పైకి) అచ్ఛా! అచ్ఛా! ఇధర్ బైఠియే.

సురే—ఒరేయి ! నీయింట్లో మేము కూర్చోము. నేను King George of white horse brandy మీద నడుస్తున్నాను. తెలిసిందా ? క్లబ్బుకు టైమైంది. Good night

(నిష్క్రమించును)

గోపీ—(గుండెలు రాసుకొని) అరే రాం. సైతాన్ వొదిలింది. వీడు మళ్ళారాకుండా పదివేలు మొక్కులు మొక్కుతాం. (క్రింద శ్యామలనుజూచి) అరే బేటీ! హేభ్యాముండాకొడుకు నీకు హైరానపని చేసాడు. (దగ్గరచేరి) వాడితో పరిచయముంవొద్దని చెప్తే మాదిమాటల్ ఖాదర్ చేసేవ్. అరే బాపురే బాప్. హెక్కడగొడవ వచ్చిందిరా బాబు. (అని ఉపచారము చేయుచుండును)

(తెర పడును)

## మూడవరంగము

ప్రదేశము : గృహాంతర్భాగము

ప్రవేశము : దుర్గాంబ

దుర్గా—(విచారముతో) ఆహా ! నా బ్రతుకిలా అవుతుందని కలలో కూడా అనుకోలేదు కదా ! అయ్యో నాథా ! నాకిందేదిదారి. యిప్పుడు నన్నాదరించేవారు యెవరు ? తల్లీ ! యిందిరా ! నీవు కూడా మాయమైపోయావా ? తల్లీ ! భగవంతుడా ! యిప్పుడు నేనేంచేయను ?

(సురేష్ ప్రవేశము)

సురే—(దుర్గాంబవద్దకుపోయి) ఏమిటమ్మా యిలాఏడుస్తున్నారు ? సంగతేమిటి? బాబయ్యగారెక్కడ ?

దుర్గ—యింకెక్కడి బాబయ్యగారు నాయనా! మనల నందరిని విడిచి వెళ్ళిపోయారు నాయనా !

సురే—ఏమిటి బాబయ్యగారు చనిపోయారు ? కొంచెం స్థిమితపడి అసలువిషయం ఏమిటో చెప్పమ్మా. (అని కూర్చుండును)

దుర్గ—ఏముంది నాయనా చెప్పటానికి. యిప్పటికి వారంరోజుల క్రితము రాత్రి అందరమూ మామూలుగానే పడుకున్నాము. ఆయన, యిందిరా ఆప్రక్కగదిలో పడుకున్నారు. తెల్లవారి లేచిచూస్తేమికదా ! యింకేముంది నాయనా! అంతాఅయోమయం. యిద్దరూ కనిపించలేదు నాయనా !

సురే—అయ్యో ! చాలా ఆశ్చర్యంగా వుందే. మరావేళ ప్రభాకరం యింట్లో లేడూ ?

దుర్గ—లేకేమి నాయనా ! అందరూ యింట్లో నేఉన్నారు. చడీచప్పుడూ లేకుండా జరిగింది నాయనా యీపని.

సురే—అరరే! ఎంతమోసం జరిగింది. ఏమయినా పోయిందా?

దుర్గ—అంతాపోయింది. ఉన్నడబ్బంతా ఊడ్చిపట్టుకుపోయేరుబాబు

సురే—రామ, రామ, యెంతదారుణం జరిగింది. సరిగా ఆసమయానికే పోటీపందెములవలన పొరుగూరు వెళ్ళవలసివచ్చిందికాని, నేనే యింట్లోఉంటే యిటువంటి దారుణం జరుగనిస్తునా?

దుర్గ—ఎవరికర్మానికి ఎవరుకర్తలు నాయనా? అంతకుముందే యిందిర పెండ్లి విషయం మాట్లాడుకొన్నాము. ప్రొద్దుపోయింది, పడుకోమని తానూ యిందిరా పడుకున్నారు. తెల్లవారిచూస్తే యిద్దరూ కనబడలేదు నాయనా!

సురే—(తనలో) యిదే మంచిసమయం, యెలాగైనా, యీపనంతా ప్రభాకరమే చేసిఉంటాడనిచెప్పి అతనిపై యీమెకు క్రోధము జనింపచేసి, యింట్లోంచి వెళ్ళగొట్టించాలి. దానితో నా ప్రయత్నము చాలావరకు succeed అవుతుంది. నాటకం ప్రారంభిద్దాం. (ఆలోచన నభినయించును)

దుర్గ—ఏమిటి నాయనా! ఆలోచిస్తున్నావు?

సురే—బాబయ్యగారి మరణవార్త వినగానే నాకు మతిపోయిందమ్మా! యిదెవరిపనై యుంటుందా అని యోచిస్తున్నాను.

దుర్గ—ఎవరపని! భగవంతుడుపనే. ఎవరు చేసేరని చెప్పగలము నాయనా!

సురే—(ఆలోచించి) ఆ, నా మనస్సున కొకటి తట్టిందండి. కాని, అది మీకు చెబితే నమ్ముతారో? నమ్మరో? అని యనుమానంగా ఉంది.

దుర్గ—ఏమిటది?

సురే—యిప్పటికి చాలారోజులక్రిత మొకనాడు, యిందిరా ప్రభాకరుడు లిద్దరు తోటలో ముచ్చట లాడుకుంటూ, మీరా యిందిరను గోపాలానికిచ్చి వివాహంచేసి, వారి క్షేమకంతరాయం కల్గించతలంచుకొన్నారని, అందుచేత వారిద్దరు యెచ్చటికైనా

పారిపోవడం మంచిదనీ, అనుకుంటూండగా విన్నాను. అప్పుడే చెబుదామనుకున్నానుగాని, మనకెందుకని ఊరుకున్నాను.

దుర్గ—అయ్యో! చూశావా! నాయనా! ఇది నిజమయి తెలవవచ్చు. ఎందుచేతనంటే ఇందిరను గోపాలాన్ని చేసుకోమని ఎన్ని సార్లు చెప్పినా ప్రభాకరాన్ని తప్ప మరొకరిని చేసుకోనని ఖచ్చితంగా చెప్పింది. ఆ వేళ రాత్రికూడా యీవిషయమై దానికీ నాకూ పెద్దగొడవ జరిగింది.

సురే—ఇంకేమి. నేననుకొన్నది యదార్థమే అయింది.

దుర్గ—కాని, పోయేవాళ్ళు పోకుండా, మధ్యను యీహత్య చేయడమెందుకు?

సురే—వాళ్ళు వెళ్ళబోయేసమయంలో యీయన లేచి అడ్డుకోబోయి యుంటాడు. అందుచేత అల్లరికాకుండా ప్రభాకరం చంపేసి ఉంటాడు.

దుర్గ—ఆయనెప్పుడూ వాళ్ళతరఫునే మాట్లాడేవారే. ఆ వేళ పడుకోబోయే ముందుకూడా వాళ్ళిద్దరిని తప్పకుండా దంపతులుగా చేస్తానని యిందిరతో అన్నారే!

సురే—తర్వాతాయనమనస్సు నీవల్ల మారిపోతుందేమోనని చేయవచ్చు.

దుర్గ—అయితే డబ్బుకూడా దొంగిలించుకొనిపోయేరే. ప్రభాకరం ఎప్పుడూ దొంగతనం యెఱుగడే.

సురే—వెర్రితల్లీ! 'ధనమూల మిదం జగత్' అన్నారు పెద్దలు. అందుచేత యిదివఱకు ఎఱుగకపోయినా యీనాడు నేర్చుకోవచ్చు. అందులోనూ నిరుద్యోగి సంచులకొలది డబ్బు సునాయాసంగా దొరుకుతూంటే వద్దంటాడా?

దుర్గ—ఎంత ప్రేమలేకపోయినా యిందిర కన్నతండ్రిని, చంపడాని కొప్పుకుంటుందా?

సురే—అమ్మా! ప్రేమ యెంతపనినైనా చేయిస్తుంది. ప్రభాకరం మీద ఉండే ప్రేమకొద్దీ యీనాటికుగా క్రూరత్వము వహించ వచ్చు.

దుర్గ—కాని నాయనా! యింతపనీ చేసినవాడు పారిపోక నాతోనే ఉంటూ యదార్థము తెలుసుకోడానికి చాలా తంటాలు పడు చున్నాడే ప్రభాకరం.

సురే—(నవ్వి) నీవింకా పెరటిత్రోవనే ఉన్నావమ్మా. దొంగతనం మీద అనుమానం లేకుండా ఎన్నెన్నో యెత్తులు వేస్తాడు. అది సహజం.

దుర్గ—అయితే యీపని తప్పకుండా వాడే చేసుంటాడు. రానీ వాడి సంగతి కనుక్కుంటాను.

సురే—తల్లీ యింకో సంగతి. ఉన్నవాడున్నట్లుండి యింకా మిగిలిన స్థిరాస్తికూడా నిన్ను నమ్మించి నీవద్దనుండి వ్రాయించుకొని, చివరకు నీప్రాణాలకు కూడా హానికల్గిస్తాడు.

దుర్గ—నిజమే. వాడు తప్పక అంతపనీ చేసేవాడే. ఇంకెందుకు ఇక యీ యింట్లో ఒక్కక్షణ ముండనీయను. రాని, అవతలకు గెంటేస్తాను. తుచ్ఛుడు-కృతఘ్నుడు.

సురే—బాగా ఆలోచించుకో తల్లీ. మీరు మీరు ఒకటే. చివరికి నేనే పరాయివాడనవుతాను. త్వరపడకు.

దుర్గ—లేదు నాయనా లేదు. నీవు నాక్షేమం గోరి చెప్పేవాడవు. ఇదివరకే వాడియందు నాకయిష్ట మేర్పడింది. ఇప్పుడు మరీని వాడి నవతలకు గెంటేస్తేగాని లాభం లేదు. పోలీసుల కప్ప గించి నిజం చెప్పించాలి. మన యిందిర మన కొచ్చేటట్టు చేయాలి. వాడూ వచ్చే వేళవుతూంది. పోయి పోలీసులను తీసుకొనిరా బాబూ!

సురే—అది ఖంగారుపడితే అయేదికాదు. ఇప్పుడు ప్రభాకరాన్ని పోలీసులకప్పగించాలంటే చాలా సాక్ష్యం కావాలి. అద్దేమీ

లేకుండా అధికార్లకు............(అని డబ్బు విషయము సైగచేయును)

దుర్గం—డబ్బా! ఏ మాత్రం కావాలి.

సురే—ఎంతోనా! చచ్చు పదివేలు.

దుర్గ—అమ్మో, అంతపుట్టుకు లేదు. వెండిసామానుగట్రా దోచుకొని పోయేరుగదా! యింకో అయిదువేలు రూపాయలు కిమ్మతు చేసే నాఒంటిమీద నగలు తప్ప యేమీ లేవు.

సురే—సరే ఉన్నదేదో యివ్వండి. మిగతా తంటాలు నేపడతాను.

దుర్గ—ఏదో ఆమాత్రం ఉపకారం చెయ్యి. నాయనా! పట్టుకొని వస్తానుండు. (లోనికి బోవును)

సురే—(ముందుకువచ్చి మీసముదువ్వుచు) భళీ. సురేష్! నీప్రజ్ఞ అసమానమైనది. ఆహా! ఎంతమాయోపాయము పన్నుచున్నావు. నీకోపాగ్నిలో ఎందరు మిడుతలవలె మగ్గుచున్నారు. (నవ్వుకొనును)

[అంత దుర్గాంబ నగలమూటతో తిరిగి ప్రవేశం]

దుర్గ—ఏంచేస్తావో, నాయనా, భారమంతా నీమీద ఉంది.

సురే—మరేమీ భయపడకు తల్లీ, సర్వమునకు నేనున్నానుగా. మీరు మాత్రము ఆ ప్రభాకరాన్ని యింటికి రానీయవద్దు.

దుర్గ—యింకా రానిస్తానా, యీవేళే వెళ్ళగొడ్తా.

[అంతలో ప్రభాకరం విచారవదనముతో ప్రవేశం]

సురే—అడుగో సమయానికే వచ్చాడు.

ప్రభా—అత్తా, అన్నిచోట్లా గాలించేను వారిజాడ ఏమీ కనుపించ లేదు.

దుర్గ—(కోపముతో) తుచ్ఛుడా! ఏలాకనబడతారు వాళ్ళు. యింటి దొంగను యీశ్వరుడైనా పట్టగలడా? యీ దారుణమంతా

చేసింది నీవు కాదూ? పైగా నామీదనేమోపనట్లు నేసాలేస్తు న్నావా?

ప్రభా—అత్తా! నేజేమిటి క్రొత్తగా మాట్లాడుతున్నా నే? నీధోరణి నా కర్థం కావడంలేదు.

దుర్గ—ఎలా అర్థమవుతుంది యిన్నాళ్ళనుండి కష్టించి యింటిలో ఉండ డంవల్ల నీయాటలు సాగేయి. చెప్పు. చెప్పు. యిందిర నెక్కడ దాచేవు. మీ మామ చెప్పినట్లు చెప్పు.

ప్రభా—అత్తా! నే నేపాపము ఆభగవంతునికి తెలియును. నామీద నిష్కారణముగా అపవాదు వేయకండి. నేనంత స్వామిద్రోహినా? నన్ను పెంచి పెద్దవానిగా చేసినవాని కొంపకే నిప్పంటించ దలంతునా? నాకింత్వమను నీకేలాగ? ?

దుర్గ—యింక నీటక్కులు నాదగ్గరసాగవు. మర్యాదగా నిజం చెప్తావా? లేకపోతే పోలీసుల కప్పగించమంటావా?

సురే—ప్రభాకరం! చేసినతప్పేదో వప్పేసుకో. నిజం నిలకడమీద బయల్పడక మానదు. అందుచే యిప్పుడే జాగ్రత్తపడితే మంచిది.

ప్రభా—(కోపముతో) Shut-Idiot. నీమూలాన్నే యీ యింటిలో యిన్ని అల్లర్లు బయలుదేరాయి. బహుశా యిది నీవు చేసిన పనే అయి ఉండవచ్చు. అంతటితో చాలక యీనింద నాపై మోపదలంచుకొన్నావా! తుచ్ఛుడా! చూడు నిన్నేమి చేస్తానో.

(మీదకు పోవును)

సురే—చూసేవా! తల్లీ. పుణ్యానికివస్తే పాపం ఎదురైనట్లు వాడు నామీద వేయబోతున్నాడు ప్రభాకరం. నాకెందుకు యీగొడవ. అతడు మీ మేనల్లుడు. మీరూ మీరూ ఒకటే. నే వెళ్లివస్తా.

దుర్గ—(వారించి) ఉండు. నాయనా! ఉండు. నీవు లేకపోతే యెలాగు. (ప్రభాకరమును జూచి) పశువా! చేసిన తప్పొప్పుకోక యింకా

వారిమీద వీరిమీద తోసేస్తున్నావా! నీవంటి కృతఘ్నునికి తావీయడం నాదేతప్పు. యింకొక్క క్షణం నాయింట్లో ఉండొద్దు. తక్షణం వెళ్ళిపో.

ప్రభా—అత్తా! తొందరపడుచున్నావుసుమా! యీ దుర్మార్గుని చెప్పుడుమాటలు విని మోసపోతున్నావు. నిజానిజాలు తెలియకపోవు. తరువాత పశ్చాత్తాపపడిన ప్రయోజనం లేదు. నిన్ను సర్వనాశం చేయడానికి తలంచుకొన్నాడీ భ్రష్టుడు. త్వరపడకు బాగా ఆలోచించుకో.

దుర్గ—ఆలోచించి చెప్పేవే యీ మాటలు. నీముఖం చూస్తే పంచమహాపాతకాలంటుకుంటాయి. నీవు ఈక్షణం నాముఖం ఎదుటినుంచి కదలిపో. తర్వాత నీమీద చర్యతీసికొని నిన్ను బంధీకృతుని చేస్తాను.

ప్రభా—అత్తా! నీ వనవసరముగా నాపై నిందమోపుచున్నావుసుమా! ఆభగవంతుని సాక్షిగా నేనేమీ యెరుగను నా మాటలు నమ్ము అత్తా.

దుర్గ—నమ్మే యింతవరకు వచ్చాను. యింక నడు. యీ యింట్లో ఒక్క నిముషం కూడా ఉండడానికి వీల్లేదు, వెళ్ళు.

సురే—నువు ఒక్కసారి చెబితే చాలదా! సిగ్గుండక్కర్లేదూ? వెళ్ళిపొమ్మంటే యింకెందు కిక్కడ?

ప్రభా—దుర్మార్గుడా! నీ వెంతకైనా తగుదువురా. ఎంత మారాజా నామీదనున్న కసినంతా తీర్చుకొనే యీ పాపఫలం అనుభవించె దవురా. (పశ్చాత్తాపముతో) అత్తా! నీవు పొమ్మన్నాక యింకొక్క నిముషమైనా యిక్కడ ఉండను. దిక్కూమొక్కూ లేని నన్ను ఆదరించి పెంచి పెద్దచేసినందుకు యివే నా కృతజ్ఞతాభివందనములు. యిక శలవు. యే నాటికైనా యోగముంటే తిరిగి కలుసుకొందాము.

దుర్గ—అట్టా గిట్టా లేదు. ముందావలకు నడు.

సురే—(నవ్వుచు) ప్రభాకరం. యీ నాటికన్నా సురేష్ సంగతి తెలుసుకొన్నావా? మర్యాదగా అవతలకు నడు. (పైకి బిగ్గరగా) వెళ్ళమంటూంటే నీకు కాదూటో. వెళ్ళవయ్యా వెళ్లు.

ప్రభా—నీచుడా! అనుభవిస్తావులే. అత్తా శలవు.

దుర్గ—ఊఁ. నడు. నడు.

(విచారముతో ప్రభాకరం నిష్క్రమించును)

(తెరపడును)

---

## నాలుగవ రంగము

వ్రాలియున్న తెర ముంగట

ప్రవేశము : ప్రభాకరం

ప్రభా—ఆహా! యెంత విపరీతము సంభవించినది. చిన్నతనమునుండి అల్లారుముద్దుగా పెంచిన [illegible], [illegible]. హృదయాధిదేవత యింటిరా, [illegible] నామీదనుమానం కలిగింది. నే నిప్పు [illegible]?

(సురేష్ ప్రవేశం)

సురే—ప్రభాకరంగారూ! ముందు విభాగాన్ని ఆలోచిస్తున్నారు కాబోలు!

ప్రభా—నీచుడా! మళ్ళా ధాపురించేవా! [illegible] నిప్పంటించేవు.

సురే—(నవ్వి) ప్రభాకరం, యీనాటికైనా యీ సురేష్ శక్తి బోధపడిందా? నేను ఆడుదాని హృదయమును గ్రహించలేని మూర్ఖుడను. సిగ్గులేనివాడను. నాది [illegible] (మరల నవ్వి) నేనేమి చేయగలను?

మూర్ఖుడను, నాది మొండిబ్రతుకు, (మరలనవ్వి) నేనేమి చేయగలను?

ప్రభా—భ్రష్టుడా! నీవింత నీచుడవని కలలోకూడా అనుకోలేదు. పో, నాయెదుటనుండి కదలిపో.

సురే—ప్రభాకరం, ఇంకా నాకసి తీరలేదు, నీమీద దుర్గాంబచే ఫిర్యాదుచేయించి నిన్ను పోలీసువారి కప్పగిండి ప్రాణములు తీసేవరకూ తీరదు, తెలిసిందా. (మరల నవ్వును)

ప్రభా—ఆభగవంతుని ఆజ్ఞలేనిదే నీవేమియు చేయలేవు. విధివ్రాత తప్పించ నీతరమా?

సురే—సరే! యింక వేదాంతమే చెప్పుదువుకానిలే. రేపటిలోపుగా నీవెక్కడుంటావో చూసుకో. (నిష్క్రమించును)

ప్రభా—పరమేశ్వరా! నీలీలలు వర్ణనాతీతములై యవాఙ్మానస గోచరములై యున్నవిగదా తండ్రీ!

సీ. కుడువకూడు లేక ♦ యిడుములొందెడిపేద
 శ్రీమంతునిన్ గాను ♦ జేయుమీవె
పరగుణోపేతుడై ♦ వరలువానిన్ క్షణ
 మాన భ్రష్టుని జేయు ♦ బూనుమీవె
దుర్జనులకును సం ♦ తోషసంగతులు స
 జ్జనుల కిడుములను ♦ సలుపుమీవె
సత్యానురాగంబు ♦ సలుపుదంపతులను
 జోదుసేడగజేయు ♦ జాలుమీవె

గీ. నిన్ను హృదయాంతరమ్మున ♦ నెగడచేసి
కొల్చుభక్తులకిడుములు ♦ కూర్తువీవె
నేనుతింపగ నేర్తునే ♦ నినుశుభాంగ
భక్తహృత్పద్మసారంగ ♦ పాండురంగ!

భగవంతుడా! యింకనూ నాకెన్ని కష్టములు కలుగజేయ దలంచుకొంటివోగదా! ఆహా! నాప్రియురాలు, యిందిరను, మేన

మామను తెలిసికొనుటెట్లు? నామీదీయపవాదుతప్పించుకొనుటెట్లు? యింకేదిదారి? నిరాధారుడను, నిర్ధనుడను, ఆదరించగల అప్తులెవరు! అక్కటా! (అని విచారించుచుండును)

(వీరన్న ప్రవేశము)

వీర—(ప్రభాకరాన్ని జూచి) బాబయ్యా! ప్రభాకరంగారంటే మీరేనా?

ప్రభా—ఆ. నేనే ఏంకావాలి?

వీర—దండాలు సామీ దండాలు.

ప్రభా—నీవెవరవు? నీపేరేమి? యిప్పుడు నాతో నీకేంపని?

వీర—సామీ! నాపేరు వీరన్నంటారు. మీతో వకరహస్యం చెప్పుకుందామనొచ్చేను.

ప్రభా—ఏమిటిరా అది?

వీర—యిలాగండి బాబూ! (అని చెవిలో చెప్పును)

ప్రభా—ఏమిటీ! మాధవరావుగార్ని చంపి, సురేష్ చంద్రశేఖరంలు యిందిర నెత్తుకొనిపోయేరా? యిందిరిప్పుడు వారివద్ద వున్నదా? చాలా ఆశ్చర్యంగా ఉందే? ఎవరురా నువ్వు. నీకీసంగతెలా తెల్సింది.

వీర—నాసాళ్ళదగ్గర నౌఖరీకి కుదిరేనుసామీ, నాను కళ్ళారా అక్కడిందిరమ్మను సూసేనండీ.

ప్రభా—నీమాటలు నిజమేనటరా!

వీర—నిజంబాబు, నిజం, అమ్మోరితోడు. యిదిగో యిందిరమ్మ మీ కిమ్మని యీ ఉత్తరం కూడా యిచ్చింది బాబూ!

ప్రభా—ఏమిటీ! ఇందిర ఉత్తరం యిచ్చిందా. చూడనీ ఏది!

వీర—యిదిగో బాబయ్యా (ఉత్తర మిచ్చును)

ప్రభా—(ఆతురతతో విప్పి యిట్లు చదువును)

ప్రియా !

నేను ప్రస్తుతము చంద్రశేఖరం యింట్లో బందీగా ఉన్నాను. సురేష్, శేఖరంలు కలసి యీదారుణం చేసారు. నాన్నగారిని చంపేసారుట. ఆయన నాకెక్కడెక్కడా కనుపించలేదు. చంపేసేఉంటారు. సురేష్‌ను నేనవమానపరచినానన్న కసికొద్దీ నన్నిలా తెచ్చికొనివచ్చి, నాన్నగారిని చంపేసి మనకుటుంబాన్ని ధ్వంసము చేసారు. సురేష్ నన్ను రోజూ నిర్బంధిస్తున్నాడు. యమయాతన పడుతున్నాను.

ఎలాగైనా నీవీ ఉత్తరం చూచుకొని, యీ రేపు రాత్రి 8 గంటలకు చంద్రశేఖరం యింటితోటవద్దకు రావలెను. నేనెలాగైనా తప్పించుకొని అక్కడికి వస్తాను. యిద్దరముకలసి పారిపోదాం. మరచిపోకు. నన్ను రక్షించేభారము నీదియే.

నీ ప్రియురాలు,

ఇందిర.

ప్రభా—(వీరన్ననుజూచి సంతోషముతో) సెభాష్. మంచిఉపకారం చేసావు నాయనా! దుర్మార్గులు ఎంతపనిచేసారు? ఆ నీచుడు సురేష్ దీనికంతకీ కారణమన్నమాట. నా యనుమానం యదార్థమే అయింది. నడు. యిద్దఱం యిప్పుడే పోలీసు స్టేషన్‌కు బోయి, యీవుత్తరం చూపించి, వాళ్ళని పోలీసుల కప్పగించి తగినచర్య తీసికొందాము. నడు. వీడి మాటలు నమ్మే మాయత్త నామీదనుమానపడి యింట్లోంచి వెడలగొట్టింది. నిజం రుజువు చెయ్యాలి.

వీర—బాబయ్యా! తొందరొద్దు బాబూ. అమ్మ యేం రాసిందో చూసేరా? మిమ్మల్ని రేతిరి 8 గంటలకి తోటకాడ కొచ్చి రచ్చించమందికాని పోలీసోల్లతో చెప్పమనలేదు.

ప్రభా—అవునురా. అవును. కాని మన మిలాచేద్దాం.

వీర—మీారేమి చెయ్యొద్దు బాబయ్యా. మీారు మాత్రం సైముకి తోటకాడికి రండి. ఆ దొంగనాయాళ్ళని పోలీసోల్ల కప్పచెప్ప డంపని నాద. ఆళ్ళపనులు తల్చుకుంటే వొళ్ళు కుతకుతా ఉడికిప్తూంది. ఎంతఘోరం ?

ప్రభా—అయితే సరే. అలాగే చేస్తానులే.

వీర—బాబయ్యా! యీాసంగతెవరికీసెప్పొద్దు. ఏమీాగడబిడలేకుండా మీారక్కడకు ఆయమ్మను తీసికొనిపోవడానికే రండి. వాళ్ళ సంగతి నే సూాత్తానుగా, బాబూ. నాను సొప్పినట్టు సెయ్యండి మీాకళ్ళెదురుగుండానే నే నాళ్ళని పోలీసోల్ల కప్పగించి నా తమాసా సూపిస్తా.

ప్రభా—అలాగే. నీవు నాకు మహోపకారం చేశావు. నీమేలు నే మరువలేను.

వీర—ఎంతమాట. అల్లరయిందంటే రంగు చెడిపోతాది. మిగతాపని నే సేస్తా. నే చెప్పింది మరచిపోకండి.

ప్రభా—అలాగే.

వీర—మరిశెలవు. బాబయ్యా యేంగడబిడ సెయ్యకండి. యెళ్లొత్తా

(నిష్క్రమించును)

ప్రభా—మంచిది. భగవానుడా! యేమి నీవిచిత్రలీలలు. యీాసంఘ టనమేల కలిగించితివో! యేమికానున్నదోకదా!

(నిష్క్రమించును)





# మేనరికం

## తృతీయాంకము

### మొదటి రంగము

ప్రదేశం : వీధి తెరముంగిట

ప్రవేశం : చంద్రశేఖరం

శేఖ—(మీసములు దువ్వుకొనుచు) భళీ! శేఖరం! నీప్రజ్ఞ నిరుపమానమైనది. నీమాయోపాయాలచేతనేం ఎన్ని ప్రాణులను దగ్ధమొనర్చుచున్నావు (రెండడుగులు ముందుకువచ్చి) గుణవంతుడైన సురేష్‌ను భ్రష్టునిగా చేసితిని. అతనివలన సర్వసౌఖ్యములు అనుభవిస్తున్నాను. కాని యిందిర ననుభవించుట కాతడు నాకు అడ్డుతగులుచున్నాడు యీతడు బ్రతికియుండగా నేను యిందిర ననుభవించుటకల్ల. కావున యెట్లయినను వీనిని సంహరించి తీరవలయు. దానితో సర్వము నాకేదక్కును. ఎట్లాగ? (ముందుకు నడచి ఆలోచన నభియించుచు) ఆ బ్రాందీ విషము- భేష్ చక్కని యాలోచన తట్టినది. యీనాడే నాశనముచేసెద. వహ్వా! శేఖరా! నీయదృష్ట రేఖ నేటినుండి బయల్పడ నున్నది.| (నిష్క్రమించును)

---

### రెండవ రంగము

ప్రదేశము : గృహాంతర్భాగము

ప్రవేశము : ఇందిర, సురేష్

సురే—(బ్రాందీ త్రాగి నవ్వుచు) ఇందిరా! యీనాటికైనా సురేష్ ప్రజ్ఞ తెలుసుకొన్నావా ? నాజేబులోని పత్రముచూపి, నలు

గుదిలో నన్ను వమానపరచేవు. తోటలో [illegible] ప్రభాకరం మా ఒడవమానపరచేవు. ఒకసారి [illegible]. వాటి ప్రతిఫలమేయిది. ([illegible] త్రాగును)

ఇంది—దుర్మార్గుడా! నీవింత క్రూరుడవని [illegible] లేదు. అనాథుడవని ఆదరించినవానికే అగ్నిలో [illegible]. కృతఘ్నుడవు [illegible]. [illegible]

సురే—(నవ్వి) ఆహ్హా! చాలా [illegible] ప్రతిఫలం బ్రాందీ యిదిగో త్రాగు (అని [illegible] పోవును)

ఇంది—ఛీ! నీచుడ! నన్నంటబోకు.

సురే—ఓహో! ఇందిరా! నీవు రామాయణగ్రంథమును బాగా చదివినట్టున్నావే! సీత రావణునికి [illegible] వున్నావే!

ఇంది—నీకన్న రావణుడు నయమే. నీవు నరరూపరాక్షసివి. పిను భూతమువు. దుష్టుడా!

సురే—(నవ్వుచు) ఇందిరా! నీ వెన్ని తిట్టిననూ నాకు సంతోషమే యేదీ ఒకముద్దు.

ఇంది—(తప్పించుకొని) మానవజన్మెత్తగానే సరా! వావివరుసలుండ నక్కరలేదా? నీచుడా! నిన్ను నాతండ్రి కుమారునివలె చూచుకొనెడివాడే?

సురే—ఈకాలములో వావి వరుసలా? నీవూ నేను ఒక్క కడుపునే బుట్టేమా! లోకులకావలను, మనకీవలను రా ముద్దు. (అని దగ్గఱకు బోవును)

ఇంది—సురేష్! దూరముగావుండు. ముట్టుకొంటివా మాటదక్కదు.

సురే—ఓహో! మర్యాదగా ఊరుకొనినకొలది మాటలు మీరుచున్నావే? నేను చెప్పినట్లు వినకపోతే నిన్నేమిచేస్తానో చూడు.

ఇంది—యింకేమి చేస్తావు? తండ్రిని సంహరించేవు. అబలనగు నన్ను పహరించుకొనివచ్చి జంటపడ నొట్టేవు.

సురే—ఇందిరా! అంతటితో సరిపెట్టలేదు. సీతల్లికి ప్రభాకరంపై అనుమానము కల్గించి, యింట్లోంచి వెడలగొట్టునట్లు చేసి, మోసము చేసిమిగిలినయీ 5,000 రూపాయలు లాగుకొన్నాను. రేపో, మాపో, ప్రభాకరాన్ని శ్రీకృష్ణ జన్మస్థానానికి, సీతల్లిని నీమేనమామగారింటికి—ఆపైన నీకింక దిక్కెవ్వరు?

ఇంది—దిక్కులేనివారికి భగవంతుడే దిక్కు, కుటిలాత్ముడా! ఏనాటికైనా నిజము బయల్పడకపోదు. ఖంగారుపడకు.

సురే—ఇందిరా! అది కలలోనివార్త. నామాట విను. నిన్ను బంధించి తీసికొనివచ్చి కూడా, నీయిష్టంవలన నీవే ఒప్పుకుంటావేమోనని యింతవరకూ నిన్ను విడిచిపెట్టేను. యింక ఓర్వలేను. రా ముద్దియ్యి, రా.

ఇంది—(తనలో) ఇంకొక్క ఘడియ దాటితే నేనిక్కడుంటేగా! అనుభవించటానికి.

సురే—ఇందిరా! సంకోచమేల? నిన్నిరా త్రనుభవించక విడువను. నేను మర్యాదగా అడుగుచున్నప్పుడు నా ప్రార్థన త్రోసివేయకు, రా ముద్దియ్యి!

ఇంది—సురేష్! యీ యింతరసు నీవీ జన్మలో అనుభవించలేవు. ఎందుకు యీ దురాశ వదలుకో!

సురే—(త్రాగి) ఏమిటీ! అనుభవించలేనూ? సరే, ఇప్పుడు నీకెవ్వరడ్డువస్తారో చూస్తానుండు.

(అని బలవంతముగ ముద్దిడబోవును.

ఇంది—ఛీ! కుటిలాత్మా! (అని చెంపపై కొట్టును)

సురే—ఏమీ! తిరిగి అవమానమా? నీతండ్రిని కలిసికొందువుగాని. రెండవ పాత్ర చూపు. (అని పిస్తలుతీసి కొట్టబోవును)

ఇంది—అయ్యో! భగవంతుడా! నాకేది దిక్కు?

(వెనుకనుండి శేఖరం చటాలున ప్రవేశించి సురేష్ చేయిపట్టుకొని)

శేఖ—ఆగవోయి ఆగు. ఆరునెలలు సాముచేసి మూలనున్న ముసలమ్మను చంపినట్లు యీ ఆడదానిమీదనా నీ ప్రతాపము. ఇందిరా! నీవు లోనికి పో.

ఇంది—(పోవుచూ, తనలో) భగవానుడా! నీకు నేను నమస్కారములు. నా ఉత్తరప్రకారం మీనాటికి ప్రభాకరం తోటవద్దకు వచ్చియుండాలి. త్రాగుబోతులు [illegible]. ఇదే మంచిసమయము. (నిష్క్రమించును)

సురే—శేఖరం! నన్నాపకు యీ వేళ దీని [illegible].

శేఖ—కంగారుపడకు. ఆలోచించి ఏపనైనా చేయాలి. [illegible] దీన్ని చంపేస్తే యేంలాభం? ఇంతా శ్రమపడి తీసికొచ్చినందుకు ఫలం దక్కాలా?

సురే—యెంత చెప్పినా అది వినడంలేదు. మీనుముక్కలి నన్ను చెంపదెబ్బకూడా కొట్టింది.

శేఖ—నే చెప్తాగా ఉపాయం. యిలావచ్చి కూర్చో. ముందు దేవతారాధన కానీ. (అని కూర్చొని యిద్దరు త్రాగుచుందురు.)

సురే—శేఖరం! నన్నవసరంగా [illegible] పాటి కెక్కడుండేదో?

శేఖ—అదేనా మనప్రజ్ఞ. నేను ఒప్పుస్తాగా [illegible] ఉన్నదంతా ఖర్చుపెట్టేసేను. ఇంకొక్క [illegible] ఎర్రనేగానీ లేదు.

సురే—మాధవరావింట్లో దొంగిలించినదంతా అయిపోయిందా.

శేఖ—Completeగా.

సురే—పోనీలే. దుర్గాంబను మోసంచేసి తీసికొచ్చిన రూ 5000 లున్నాయి. ఇవిగో (అని నోట్లిచ్చి, త్రాగుచుందురు.)

శేఖ—(తనలో) భేష్. పాచిక పారింది. మత్తెక్కి ఉన్నాడు. ఇదే సమయం వీడిని యమలోకానికి పంపడానికి. పీడవదలుతుంది.

(పైకి) సురేష్ యీమధ్యను క్రొత్తరకం బ్రాందీ తెప్పించేను చూసేవా?

సురే—(త్రాగి) రాస్ రుచిమాద్దాం.

శేఖ—పట్టుకొస్తానుండు. (అని లోనికి బోవును)

సురే—(త్రాగుచు, నవ్వుచు) బ్రాందీ స్వర్గము. బ్రాందీ (నవ్వును)

శేఖ—(విషము కలిపిన బ్రాందీతో ప్రవేశించి) సురేష్! నీకు మృత్యు వాసన్నమైనది. శేఖరం యింకొక నిముసములో నీవీ పిశాచమునుండి విముక్తుడవు కాగలవుకదా! ఏమినీయదృష్టము (సురేష్‌ను సమీపించి) యిదిగో! సురేష్! సేవించు.

సురే—ఏదీ! అమృతము. (అందుకొని త్రాగి) ఆహా! మాధుర్యం. స్వర్గం.

శేఖ—యింకొక నిముసములో నీకు స్వర్గమే కనబడగలదు.

సురే—శేఖరం - స్వర్గం - ఆ స్వర్గం - అదిగో - ఆ - కళ్ళు... అదిగో - (అని లేచి) అదిగో యిందిర. ఆ మాధవరావు - రా త్రాగు. అవమానం. ప్రతిఫలం(నవ్వి)బ్రాందీత్రాగరా... రా (తూరలనవ్వి) ఆఁ ఆదిగో స్వర్గం. (క్రిందబడును)

శేఖ—(నవ్వుచు) విషం తలకెక్కుతూంది. చావు. పాపాత్మా. చావు.

సురే—(గిలగిల తన్నుకొనుచు) దా - హాం ప్రా - ణములు - దా - హాం బ్రాందీ - దాహాం - అబ్బా - దాహాం - స్వర్గం - మాధవరావు - యిందిర - ప్రభాకరం - దుర్గాంబ - శ్యామల — వస్తున్నా - దాహాం.

(కొట్టుకొను చుండును)

శేఖ—(నవ్వుచు) దాహముట. దాహాం. చావు, గిలగిల తన్నుకొని నీపేరు చెప్పుకొని గుక్కెడు బ్రాందీ త్రాగుతా. (త్రాగును)

సురే—అబ్బా! దాహాం. ప్రాణాలు (అని మూలుగుచూ చచ్చినట్లు పడియుండును)

శేఖ—(వికటంగా నవ్వుచు) ఎగిరిమెగిరిపడి చచ్చినాడు. శనివదలింది నిశ్చింత. (మరల త్రాగి త్రేన్చుచు) భేష్ శేఖరం. నీ వెంతటి కైనా తగుదువుకదా! పట్నవాసం చదువని మొదలుపెట్టి తల్లిదండ్రులు పంపించేడబ్బు చదువునూ నేసి Peg కు ఖర్చు పెట్టేను. ఆముసలిపీనుగ లింకా చదువు వెలిగిస్తున్నాననే యనుకుంటున్నారు. ఆడబ్బుచాలక యీసురేష్‌ను లోబరుచు కొని, వాడినికూడా పాడుజేసి, చివరకు మాధవరావు వింటికి కన్నమువేసేము. దానితో ఉండక, యీ 5000 కూడా లాగి వేసి శనివొదులుకున్నాం. (మరల త్రాగి) నవ్వి సురేష్‌ను తన్ని-వెర్రిపీనుగ చచ్చేడు. యింక యిందిర ననుభవించాలి, (అని తూలుచూ పోబోవ యెదురుగా వీరన్న పోలీసు యిన స్పెక్టరుతో ప్రవేశించును. అంతవారిని చూచి ఉలికిపడి) ఆ! పోలీసులా! (మరియొక ప్రక్కకు పరుగెత్తును)

వీర—(చూచి) దొంగముండావాడు. పారిపోతున్నాడు పట్టుకోండి బాబయ్యా!

యిన—Constables డబ్లస్. ఎంతమోసం. పలాయన మారంభించి నాడే. (అని క్రిందజూచి) యిదేమి?

వీర—(సురేష్‌ను జూచి) అరే! బాబుగారి కెంతమోసం జరిగింది.

(సురేష్‌వద్ద కూర్చుండును)

యిన—(అంతటను జూచి. బ్రాందిసీసా విషమును జూచి, సురేష్ నాడిజూచి) నాడివుంది. దుర్మార్గుడు యీతనికి విషప్రయో గము చేసినట్లున్నాడు. నెం 205, త్వరగా డాక్టరుని తీసికొని రా. వీరన్నా యిందిరేది? (తెరలో యస్! సార్)

వీర—(లేచి) యిందిరమ్మగారూ! యిందిరమ్మగారూ! (లోనికిబోయి తిరిగి వచ్చి) అయ్యయ్యో! అనుకొన్నదంతా తారుమా రైంది. బాబయ్యా! ఆఅమ్మెక్కడా కనిపించలేదండి.

ఇనె—అరరే. ఇదంతా చాలా తమాషాగా ఉందే. దొంగాపారి పోయేడు. ఇందిరా కనబడుటలేదు. ఇతడెవరు ? యీతని కిక్కడెవ్వరన్నా బంధువులున్నారా ?

వీర—బంధువులు లేరుగాని, యీవూళ్లో గోపీచంద్ శేఠుగారు వీర్కి తెల్సు. పిలిపించండి బాబయ్యా.

ఇనె—నెం 207 గోపీచంద్ అర్జంటుగా తీసికొనిరా (తెరలో yes sri)

ఇనె—(సురేష్ నాడి మరల పరీక్షించి) ప్రాణముపోలేదు. త్వరగా డాక్టరువస్తే బాగుండును.

వీర—(ముందుకు వచ్చి తనలో) అరి దేవుడా ! యెంతపని జరిగింది. ప్రభాకరం బాబిందిరమ్మను తీసుకుపోయేడుగానోను. సరే కానీ.

(కంగారుతో గోపీచంద్ ప్రవేశించి)

గోపీ—రాం. రాం. కొత్వాలుజీ. క్యా సమాచార్.

ఇనె—గోపీచంద్ అంటే నీవేనా ?

గోపీ—జీ ! సర్కార్.

ఇనె—చూడు యీతని కెవరో విషప్రయోగము చేసేరు. నీవీతని యెరుగుదువా !

గోపీ—(చూచి ఉలికిపడి) అరే ! సురేష్ బాబు. యెంతఘోరం, యెంతఘోరం. (దగ్గరగాచేరి విచారించుచుండును)

ఇనె—అయ్యా ! విచారించకండి. యింకా ప్రాణాలు పోలేదు. నాడి ఉంది. త్వరగా డాక్టరువద్దకు తీసికొనివెడదాం. వీరన్నా సాయంబట్టు. లోనికి తీసికెడదాం.

(అందరూ అట్లు చేయుదురు.)

(తెరపడును.)

మూడవ రంగము.

ప్రదేశము : గోపాలంగారి యిల్లు.

ప్రవేశము : గోపాలం.

గోపా—(గోచీ ఊడబీకుకొని కంగారుతో ప్రవేశించి, పడిపోయి తిరిగి లేచి ఒడలు దులుపుకొనుచు) కుర్రకుంకలు నాతో వేళాకోళ మేమిటి. బుద్ధిలేని వెధవలు—అంతసట నేను ముసలినా ! ప్రతీ వాడికి లోకువగా కనబడుతున్నాను—అబ్బబ్బ.

గీ. ముసలి ముసలి యంద్రు పరమ ♦ మూర్ఖులిలను
నిజముగా నేను ముసలినే ♦ నిగ్గుతేరి
న యువకుడనెగా ! భార్యలే ♦ నట్టిలోప
మేగదా! యిన్నిటి కిని మూల ♦ మేమిచేతు ?

పెళ్లాం ఉంటే యేగొడవా లేకపోనుగదా! ఆ దామోదరరావు గారి పిల్లని మాట్లాడమని పేరయ్యను పంపించేను. ఏమయిందో (కూర్చుని) పోనీ అది కాకపోతే తనకూతురు నిస్తానని నాచెల్లెలు ఉత్తరం వ్రాసిందికదూ ! యీ రెండుసంబంధాల్లో ఏదో ఒకటి త్వరగా settle చేసికోవాలి.

(అంత పేరయ్య ప్రవేశం)

పేర—నమస్కారమండి. గోపాలంపంతులుగారూ!

గోపా—ఆ! మంచిది రా, రా, నీకోసమే యెదురు చూస్తున్నాను. యిలాకూర్చో.

పేర—చిత్తం, చిత్తం, (కూర్చుండును)

గోపా—పేరయ్యా !యింతకూ దామోదరరావుగారు పిల్లనివ్వడానికి ఒప్పుకున్నారా ? లేదా ?

పేర—ఒప్పుకోకేంచేస్తారండి. ఒక సంచీకోసిపారేస్తే నోరుకట్టుబడి పోదూ ?

గోపా—అమ్మో! మళ్ళాయీసారి యింకో వెయ్యిరూపాయలివ్వనా?

పేర—బాబూ! మూడో పెళ్ళంటే మాటలేకుండా అవుతుందను కొన్నారా! చూడండి! తమబోటి వయస్సు మళ్ళినవాళ్ళకు యెవరు పిల్లనిచ్చినా డబ్బు కక్కుర్తికే కదూ?

గోపా—ఏమిటోయి పేరయ్యా! అలా అంటావు? నేను ముసలాడినా? మూడో పెళ్ళి చేసుకొన్నంత మాత్రాన ముసిలాడి నవుతానటయ్యా! చూడు. నే నెలాగున్నానో? ఒక గ్రుద్దు గుద్దితే ధణాముని రాయి రెండు ముక్కలవుతుంది. నా శరీరము నా యౌవనము చూడు. యీ కాలంలో యువకులమనుకొనే వ్యక్తులు నాతో పనిచేయగలరా?

పేర—నిజమేనండి నిజమే. తమకు కన్నమిచ్చినదే పిల్ల నివ్వవలసిన మాటండి. నవమన్మథాకారులు చూడండి ఆముఖము, ఆదవడలు, ఆపళ్ళు, ఆహాహా! మిమ్మల్ని చూసి ఏస్త్రీ వరించదండీ.

గోపా—బేష్! నీవు బాగా గ్రహించేవోయి! పేరయ్యా! నాసంగతి అసలు పెళ్ళి చేసుకోకుండానే ఉందామనుకున్నాను కాని—

పేర—ఎంతమాట? తమ కేమంత పెద్దవయస్సుందని పెండ్లి మానెయ్యడం! అదీగాక, మీకిప్పటికా రెండు పెండ్లిండ్లవల్ల ధర్మార్థ కామాలు దీరిపోయేయి. యింక యీ మూడవ పెండ్లివల్ల మోక్షం రావాలి, అందుచేత తమరు పెళ్ళి చేసుకోవడం ముఖ్యం.

గోపా—అందుకనేకదూ! యీ మూడో పెళ్ళి. చూసావూ చచ్చిన యిద్దరు పెళ్ళాలవల్లా ఫలం లేకుండా పోయిందికదా? పుత్రులు లేనివారికి గతులు లేవంటారు. అందుచేత మూడో పెళ్ళాం కడుపునైనా ఒక కాయ కాబింతంటే ఆకాస్త మోక్షం వస్తుందని.

పేర—నిజమేనండీ, నిజమే. (తనలో) బిడ్డల కేమిలోటు! ఏయువకుడో రెండవరంగం తెరిచేడంటే కావలసినంతమంది బిడ్డలు.

గోపా—అయితే పేరయ్యా! నాకు కావలసినంత డబ్బుందికదా! అందానికా మన్మథుడిలాగున్నాను. బిడ్డాపీచూ యేమీలేదు.

అంతా ఆపిల్లకేగదా! యిటువంటి మంచిసంబంధాన్ని దామోద్రావు కాలదన్నటానికి కారణమేమిటి?

పేర—ఆయన మూర్ఖుడండి. తెలియదూ? ఆయనకి కావలసింది డబ్బు. ఆపిల్లలు సంచీరూపాయిలిస్తేగాని ఎవ్వరికీ యివ్వనని ఖచ్చితంగా చెప్పేడు.

గోపా—రామ రామ! ఎంతదారుణాని కొడిగట్టుకున్నాడు. కన్యాశుల్కం తీసికోదలచుకొన్నాడన్నమాట.

పేర—(తనలో నవ్వుకొనుచు) [illegible] పెళ్లిచేసుకోవడం దారుణం కాదుగాని, ఆయన కన్యాశుల్కం పుచ్చుకోవడం దారుణమట. యిటువంటి ముసలి పెండ్లికొడుకులు అటువంటి కన్యాదాతలు లేకపోతే మూనోట్లోకి కరక్కాయ. (పైకి) నేచెప్పేను కాదండి. ఆయనకు డబ్బే ప్రధానం. అదిలేనిదే పిల్లనివ్వడు.

గోపా—పోనీ యివ్వకపోతే చూచుకోవును. మనకింకా సిద్ధమయ్యే ఉంది.

పేర—ఎవరిపిల్ల బాబూ!

గోపా—పైసంబంధం కాదోయి మా చెల్లెలి కూతుర్నే

పేర—ఏమిటీ మాధవరావుగారి కూతురినా? ఆ అమ్మాయిని ఆయన మేనల్లుని కిస్తారనుకొన్నారు కదూ.

గోపా—ఎలాయిస్తారోయి. వాడికేమున్నా ఆస్తివుందనా? అందగాడనా?

పేర—(తనలో)అతనికన్న తనేఅందగాడ ననుకొంటున్నాడు. పగలు చూస్తే రాత్రి కలలోకొచ్చే అందమిది. (పైకి) నిజమేనండి. నిజమే.

గోపా—అదీగాకుంటే వాడు బ్రహ్మసమాజంలోచేరి పెద్దసంఘసంస్కర్తనంటూ బయలుదేరి కులభ్రష్టుడయ్యేడు. అనాథుడు ఎలాగో మా బావగారే బి. ఏ. వరకు చదివించేరు. యీ

కాలంలో ఎంతచదువు చదివితేమాత్రం ఏంలాభముందోయి పేరయ్యా! ఒక్కకానీ సంపాదనైనా లేకుండాయేడుస్తున్నాడు.

పేర—నిజం. బాబు నిజం. లేకపోతే యీకాలంలో ఉద్యోగా లెక్కడ దొరుకుతున్నాయిబాబు. ఏమైనా పెద్దశిఘాద్నులుంటే కలలోకూడా అనుకోని చవటలుసైతం రు 100 లు 150 లు సంపాదిస్తున్నారు. యిక ఏమీలేనివాడిని చూసేదెవ్వరు ?

గోపా—అంతేనోయి, అంతే. అస్తిపరుడయివుంటే యీకాలంలో చలామణీ అవుతాడు. అందుచేత అటువంటివాడికి స్త్రీ పిల్లసుఖ పడదని నేను అన్నిలక్షణాలు కలిగిన అందగాడనని నాకిచ్చి నట్లయితే ఆవైపుఆస్థి యీవైపుఆస్తి అంతా ఆపిల్లకే దక్కు తుందని ఆలోచించి, నాకిస్తానని మాచెల్లెలు ఉత్తరం వ్రాయించింది.

పేర—అయితే ముహూర్తం నిశ్చయించారా బాబూ !

గోపా—యింకాలేదు. కాని యీమాసంలోనే తప్పకుండా చేసు కుందామనుకుంటున్నాను.

పేర—యింకేమి ! పెండ్లికూడావిడిలో ఉన్నారన్నమాట.

గోపా—పేరయ్యా! అందుకనేగా నిన్నిక్కడకు పిలిపించేను. యిదిగో చూడు. నాకు వెనకాల దిక్కెవ్వరూలేరు. పెండ్లిప్రయత్న మంటె మాటలుతోలేదు. పోనీ నేనేచేసుకుందామంటె ఒంట్లో ఓపిక లేదు.

పేర—(తనలో) యిప్పటికి నిజం చెప్పేడు. ఒంట్లో ఓపికలేనివాడు పెళ్ళాముతో కాపురమెలాగ వెలిగిస్తాడో. సక్తిఉన్నా లేకపో యినా పెళ్ళాంమాత్రం కావాలి.

గోపా—ఏమి ఏమంటావు?

పేర—చిత్తం. చిత్తం. అలాగే నలుగురు నాలుగు చేతులు వేస్తే యిట్టె యీడ్చి అవతలపారేస్తాము. (తనలో) దామోదర్రావు గారి పేరుచెప్పి, ఎలాగో మాయచేసి ఆవెయ్యిరూపాయ

లపహరిద్దామనుకున్నాను పోనీ యీ పల్లిప్రయత్నాల్లోనైనా అధమం నాలుగువందలైనా సంపాదించాలి.

గోపా—ఏమి టాలోచిస్తున్నావు. నీకు వీలుపడదూ ?

పేర—ఆ ! వీలుపడకేమి ? ముహూర్తమింత తొందరగా పెట్టేస్తున్నారు, ఆనాటికి కన్నీ సిద్ధపడాలో యూ ! అని.

గోపా—అసలీ నెలలో ముహూర్తాలెప్పుడున్నాయి?

పేర—అదిగో అలా అడగండి చెప్తాను (అని వేళ్ళమీద లెక్క సరిచేసి) మొన్న తదియనాడొక ముహూర్తం వెళ్ళిపోయింది. యీ చవితి కాక వచ్చే చవితి కొక ముహూర్తముంది. ఆ ముహూర్తమే మీ కన్నివిధాలా సరిపడుతోంది. కాని ఆ ముహూర్తానికి వారూ మీరూ తయారుగలరా ?

గోపా యీవాళే మా చెల్లెలికి ముహూర్తం నిశ్చయం చేసినట్లు ఉత్తరం వ్రాయిస్తాను. వాళ్ళు తయారవుతుంటారు. కాబట్టి నువ్విలోపుగానే అన్నీ తయారు చేయించాలి.

పేర—చిత్తం. అలాగే.

గోపా—యిదిగో! పెత్తనమంతా నీకే యిస్తున్నాను. కావలసినంత డబ్బిస్తా తెలిసిందా పెట్టేపని ప్రారంభించు. ఏమీలోటు లేకుండా చేయాలి.

పేర—చిత్తం. చిత్తం. మీలాంటి లక్షాధికార్లింటిలో లోటేం వస్తే మాట దక్కుతుందా ? నాసంగతి మీ రెరుగరు కనుకనా ! లోటు రానిస్తానా ?

గోపా—తెలిసే నమ్మకస్తుడవని నీకిచ్చేను పెత్తనమంతా మరి ఏం చేస్తావో.

పేర—మీరలాగే పెరుకుండండి. అంతా నిముషాలమీద నడిపిస్తాను.

గోపా—ఏమో ! బాధ్యతంతా నీమీద పెట్టేను. డబ్బుతో వ్యవహారము సుమా యిది. దగా చేయగలరు నిన్ను. భద్రం. అతి క్లిష్టంగా, నేర్పుతో వ్యవహారం నడిపించాలి,

పేర—చిత్తం. చిత్తం. (లోన) యీలాంటి పిసినిగొట్టులకేదొరుకుతూంటారు మాలాంటివాళ్లు. (పైకి) కాని పంతులుగారూ! మీరు చాలా అదృష్టవంతులు సుమండి.

గోపా—ఏమి?

పేర—చదువుకొన్న భార్యను సంపాదిస్తున్నారు.

గోపా—ఏమి అదృష్టమోయి. యీ చదువుకొన్నవాళ్లెలాగ మన మాట వినరు. ఏం అఘాయిత్యం చేస్తుందో అని భయంగా ఉంది.

పేర—ఆఁ మరేమీ భయంలేదు. అందరూ అలాగే ఉంటారు(తనలో) యీ వెఱ్ఱిమొగాని కేలాగా సున్నప్పిడతే, లేకపోతే వీడు చదువుకున్న భార్యతో వెగగలడా!

(దుర్గాంబ యేడుస్తూ ప్రవేశం)

దుర్గ—అయ్యో! అన్నయ్యా! కొంపమునిగిపోయిందిరా బాబు. యింకేముంది. (అని చేతనున్న మూటతో క్రింద చతికిలబడును)

గోపా—(తత్తరపాటుతో) యేమిటేమిటి? అంతతొందరగా యేడుస్తూవచ్చేవేం? చవితినాడు ముహూర్తం నిశ్చయంచేసానని యిప్పుడే నీకుత్తరం వ్రాయిద్దామనుకొన్నాను.

దుర్గ—యింకేమి చవితిరా బాబూ! సర్వనాశనమయిపోయింది.

పేర—ఏమండోయి దుర్గాంబగారూ! కొంచం స్థిమితపడి జరిగిన సంగతేమిటో చెప్పండి.

గోపా—చెప్పుమ్మా. చెప్పు.

దుర్గ—అర్ధరాత్రివేళ మీ బావను, యిందిరను యెవరో ఎత్తుకుపోయార్రా బాబూ! ఉన్నదంతా దోచుకుపోయారురా తండ్రీ!

గోపా—ఏమిటి! బావను, యిందిరను, ఎత్తుకొనిపోయేరా? యీ సంగతి జరగ్గానే నాకు తెలియపరచలేదేమి? యింతకూ యెవరిపనంటావిది?

దుర్గ—ఆ ప్రభాకరంపనే అయివుంటుందిది. అందుచేతనే వాడిని పోలీసుల కప్పగించమని యీవిషయంలో జాగ్రత్తగా పని చేయమని సురేష్‌కంతా పోగా మిగిలినడబ్బుకూడా యిచ్చి యిలా వచ్చేను.

పేర—ఎన్నాళ్ళయిందమ్మా యిదిజరిగి?

దుర్గ—ఒకవారం రోజులక్రితం నాయనా!

గోపా—హాని హాని. ఎంతపని జరిగింది. ఉన్నడబ్బంతా తగులబడి పోయిందన్నమాట? చాలా చిత్రంగావుందే!

పేర—అయితే ప్రభాకరమింతదారుణానికి పూనుకోవలసిన అగత్యమే మొచ్చింది?

దుర్గ—ఏముందినాయనా! ధనాశ. యిందిరను తనకు దక్కనీయకుండా చేస్తానని.

గోపా—ఎంతఘోరం జరిగింది.

దుర్గ—యింకనాకు దిక్కెవ్వరురా తండ్రీ! నాకేదిదారి నేనెలా బ్రతకను?

పేర—ఏమండోయి దుర్గమ్మగారూ! అయిపోయినదానికి విచారిస్తే యేమిలాభం? ఊరుకోండి.

దుర్గ—యేం ఊరుకోనుబాబూ! నాఖర్మమిలా ఉంది. నాపిల్లేమయిందో బాబూ అయ్యో!

గోపా—అమ్మాయి ఊరుకో నెమ్మదిమీద సంగతంతా చెబుదువు కాని. తర్వాతేంతఖర్చయినాసరే! యీవిషయంలో నేనుగట్టి ప్రయత్నం చేస్తాను. ముందు నీవువెళ్ళి భోజనంచెయ్యి. ప్రయాణంవల్ల అలసివుంటావు.

దుర్గ—భోజనంవొద్దు. యేమీఒద్దు. అయ్యో నాకేమీ తోచడం లేదన్నయ్యా!

గోపా—భోజనం వద్దంటె యెలాగ? నీవిషయంలో నాశాయశక్తులా ప్రయత్నం చేస్తానన్నానుగా! వెళ్ళు. భోజనంచెయ్యి.

పేర—అవునండమ్మా, వెళ్ళిరండి, బాబుగా రమ్మాయని వెదికించి అప్పగిస్తానన్నారుకదూ, లేవండి. విచారించకండి.

(దుర్గాంబ బలవంతముమీద విచారములో నిష్క్రమించును)

గోపా—పేరయ్యా! యెంతపని జరిగి ది? ఇదంతా ఆ పూలచదువు మహాత్మ్యమేసుమా!

పేర—అదికాదు బాబూ! విధివ్రాత.

గోపా—సరేగాని మనమనుకున్న ముహూర్తం వృధాగాపోకూడదు ఆదామోదర్రావుగారి సంబంధము settle చేసెయ్యి.

పేర—(తనలో) ఆరి! నీపొట్ట పొడిచి వేయ. చెల్లెలంత విచారంలో ఉన్నా పెళ్ళిసంగతి వదల్లేదు. (పైకి) అలాగే సెలవండి. మరి డబ్బుమాట.

గోపా—వారిష్టప్రకారమే యిద్దాం, మనవసరం.

పేర—ఆ! వల్లోపడ్డాడు. ఇదే మంచిసమయం. వచ్చినదంతా రాబట్టుకోవాలి. (పైకి) కాని పంతులుగారూ! వాళ్ళాముహూర్తానికి తూగగలరో లేదో?

గోపా—తూగలేకపోతే ఉభయఖర్చులు మనమే పెట్టుకుందాం.

పేర—యింకేమి! అయితే అంతా sette అయినట్టన్నమాటే. మీరు ఆవెయ్యి రూపాయలు, ఉభయపక్షాల పెండ్లిఖర్చులు పదిహేనువందలు, మొత్తం రెండువేల అయిదువందలురూపాయ లివ్వడమే తరవాయి.

గోపా—అమ్మబాబో! రెండువేల అయిదువందలే.

పేర—బాబూ! మీరు అలాగంటే యెలా చెప్పండి. ఇందులో నది తప్పుతుంది. వాళ్ళ కివ్వవలసిన రు 1000 లు తప్పవుకదా! జమీందారులు పెళ్ళి చేసుకుంటూ, యిరుపక్షముల పెండ్లి ఖర్చులక్రింద మొత్తం పదిహేను వందలైన లేకపోతే బాగుంటుందా! యీ war days లో అన్నదానానికే అవుతుందంటాను, బాగా ఆలోచించుకోండి.

గోపా—అయితే! తక్కువ కాదంటావా!

పేర—మీయిష్టం,

గోపా—సరే, అలాగే చేద్దాం. మన అవసరం.

పేర—చిత్తం, చిత్తం. మరి నామాట.

గోపా—నీవెక్కడికి పోతావు. నేనెక్కడికిపోతాను. మొగట పెండ్లి కానియ్యి.

పేర—అలాగేలెండి. యీమధ్యను ఒకరిదగ్గర రు 500 లు బదులు తీసుకొచ్చేను. వాళ్ళు అవసరం వచ్చిందని పీకిమీద కూర్చు న్నారు. వాళ్ల బాధ పడలేకుండా ఉన్నాను. అయిదువందలు కూడా యిప్పిస్తే నన్ను రక్షించినవారవుతారు.

గోపా—ఏమిటీ! నీ కయిదువందలే.

పేర—రేమిటో తమదయ చూడండీ! నామీద యెంతో బాధ్యత పెట్టేరు. పెర్మిట్లులేకుండా బియ్యం సంపాదించాలి. ఎ.ఆర్.పి వారిని ఆశ్రయించి కిర్సనాయిలు సంపాదించాలి, పందిళ్ళు వేయించాలి, తెగతినడానికి వచ్చే బంధువులకి, మర్యాద చేయాలి. అదిగాక నావంటి పేదవాణ్ణి, పిల్లలు గలవాడిని తమబోటి శ్రీమంతులు కనిపెట్టకపోతే బ్రతగ్గలమా!

గోపా— నీ అయిదువందలు తరువా తిస్తానులే, ముందు రెండు వేల అయిదువందలు తీసుకో.

పేర—అబ్బే! అలాగంటేకాదు. మొత్తం రు3000 లు ఇచ్చిననాడే పెళ్ళి జరుగుతుంది,

గోపా—గొప్పగొడవే వచ్చిందే? సరేలే. పట్టుకొస్తానుండు,

(లోనికి పోవును,)

పేర—భేష్! గేలాముకు తగుల్కుందిచేప, ఇటువంటివాళ్ళ కిలాగా అవాలి. ముష్టాడికైన కానీ ఇచ్చిన పాపాన్ని పోయేడూ!

లుబ్ధాగ్రేసర చక్రవర్తి పెళ్ళంటే అతినమ్మకముగా మూడు సంచులిస్తున్నాడు. యీ పేరయ్య వీడికి తగిన పెళ్ళే చేయిస్తాడు. యీ దెబ్బతో ముసలిపీనుగ లందరికీ ఉండే పెళ్ళి సరదాతీరాలి మంచి నీతిపాఠము నేర్పుతా!

(గోపాలం డబ్బుతో ప్రవేశించి)

గోపా—యిదిగో! మూడు వేలు నమ్మకముగా యిస్తున్నాను. పెళ్ళిచవి తినాడు తప్పకుండా జరగాలిసుమా! జాగ్రత్తగా లెక్కపెట్టు? (అని నోట్లు చేతికిచ్చును)

పేర—(లెక్కపెట్టుచు) నమ్మకంగా పెళ్ళి చేయిస్తానండీ. మీకా సందేహం మక్కరలేదు.

గోపా—ఉన్నాయా! సరిగ్గా!

పేర—ఆఁ

గోపా—మళ్ళా చూడు.

పేర—ఉన్నాయండి సరేగాని పంతులుగారూ! పెళ్ళిప్రయత్నమంటే చిల్లర లేకుండా అవదు. అందుచేత ఏదైనా కొంచెం చిల్లరిప్పించండి.

గోపా—నేనెక్కడ తేనోయి చిల్లర. కొట్టుమీదికి రూపాయనోటట్టుకెళి పదణాలు సామానుకొని మిగతాది యిమ్మంటే చిల్లర లేదంటాడు. కాతాకొట్టుమీదకిపోయి సెట్టిగారూ! రూపాయి చిల్లరివ్వండని మొప్పడెళ్ళినా, 'వాళ్ళ అబ్బాయి పెళ్ళనో, అమ్మాయిసమర్తనో, ఏదో వంకపెట్టి, కాళీగళ్ళాపెట్టి చూపిస్తాడు' యింకపైగా యెక్కడైన సంపాదిద్దామంటే రూపాయి కణాలు. బేడలు, పావలాలు, మారక మడుగుతారు. పోనీ గవర్నమెంటు బ్యాంకి కెడితే అక్కడ సరాబులు చేసే మోసం చెప్పనక్కరనేలేదు. యింకెలా చచ్చేది. అందుచేత ఎక్కె గుమ్మం, దిగేగుమ్మంకాబట్టి, ఆబాధేదో నువ్వేపడుదూ?

పేర—సరిసరి. ఆ బాధ్యత కూడా నామీదే పెట్టేరు.

గోపా—చూడు. పేరయ్యా పెద్దవాణ్ణి, చాదస్తం పోకున్న, అందు చేత రు 3000 లు పుచ్చుకొన్నట్లుగా చిన్న చీటీ యివ్వు.

పేర—(లోన) అరి పిసుగా, డబ్బంటె దెయ్యం మాదిరినే కూడెస్తావురా! (పైకి) ఏమండోయి. నాకూరికే యిస్తున్నట్టుగా సన్మానం లేకుండా చీటీ యిమ్మంటారేమిటండి. యిష్టముంటె యివ్వండి లేకపోతే యిదిగో తీసికోండి.

గోపా—ఆ. ఆ. నమ్మకం లేక కాదు. యిచ్చినట్టు కాదా మరి అని అడిగాను. నీసంగతి నాకు తెలియదా?

పేర—చిత్తం. శలవు.

గోపా—వెళ్ళిరా, డబ్బు జాగ్రత్త. తప్పకుండా అనుకొన్నపని నెరవేరాలి.

పేర—ఆ. డబ్బు జాగ్రత్తగానే ఉంటుందండి. శలవు.

గోపా—మంచిది. నాకూ సంధ్యావందనానికి వేళయింది వెళ్ళాలి.
(నిష్క్రమించును)

పేర—యింక నీ బ్రతుకు సంధ్యావందనాలతోనే సరిపెట్టుకోవుగాని, ముసలాడికి పెళ్ళి కావాలేం. ఈ మూడు వేలతోను సంజ్ఞ సరదా తీరుతుంది ముండావాడికి ఇంక యీ పేరయ్య మళ్ళీ ఊళ్ళో కనబడితేగా! కుక్క కాటుకి చెప్పుదెబ్బ. పిసినిగొట్టుకింతే శాస్తి.
(నిష్క్రమించును)

(తెర పడుడు)

---

నాలుగవ రంగము.

ప్రదేశము : చావడి.

ప్రవేశము : యిందిర, ప్రభాకరం

ఇంది—(పాడుకొనుచు, లేసు అల్లుకొనుచుండును)
పరమేశ్వరా! ఆ దుర్మార్గుల బారినుండి తప్పించుకొని నా ప్రియునిగలసికొంటినని సంతసించుచుండ మరల నీకుస్థితి యేమి!

నానాథుడెంత ప్రయత్నించిన నుద్యోగము లభించుటలేదు గదా? ముందుగతి యేమగునో!?

ప్రభా—(విచారవదనముతో ప్రవేశించి) ఆహా! ధర్మమార్గాను వర్తులై బలపరాక్రమములచే విజృంభించిన మహారాజులను, రామదాసాది భక్తాగణ్యులను కాళిదాసాది మహాకవులను గని, సర్వసంపదలకు పుట్టినిల్లై, దేశదేశముల ఖ్యాతిగడించిన యీ భారతభూమి నేడు...........

సీ. ఎంఏలు, బియ్యేలు ♦ యింపుగ జదివియు
జ్ఞానంబు లేనట్టి ♦ జడులతోడ
మద్యపానంబును ♦ సహభోజనారి దాసులై
సర్వంబు గోల్పోవు ♦ జడులతోడ
వ్యభిచారమన్ వ్యసన ♦ నాదులం దగిలియు
నయము పరితపించు ♦ నరులతోడ
పంటబోయినగూడ ♦ బన్నుల దెప్పించు
రైతుల వేధించు ♦ రాజుతోడ

గీ. హంతకులతోడ జారచో ♦ రాది బనుల
నాచరించు జనులతోడ ♦ యనృతసాక్ష్య
మొసగు లంచగొండులతోడ ♦ ఓహో! నేడు
భరత భూమి నిక్కము నిండె ♦ పాతకులతో!

ఛీ! ప్రపంచమంతటా ఏమూల చూసినా మోసమే. అంతా మోసం. (కూర్చుండును. ఇందిర దగ్గరకువచ్చి కూర్చుండును)

ఇంది—బావా! ఏమి? మరల నేమిజరిగినది! నీవదనమంతవాడియున్న దేమి?

ప్రభా—ఇందిరా! విచారముకాక, నాకుసంతోషమెక్కడిది? బి. ఏ. ప్యాసగు, చివరకు, రూ 10 లు ఉద్యోగమైన సంపాదించలేక పోతున్నాను. మాడుబ్రతుకు.

ఇందీ—'ఉద్యోగ మిస్తాను, రు 500 లు తీసికొని రమ్మన్నా'డని పట్టు కొని వెళ్ళేవుకదా? ఏమయింది ?

ప్రభా—ఏమయింది. ఆ రు 500 లు తీసుకొన్నాడు. మళ్ళా ఆమనిషి అయిపు లేడు. Enguiry చేస్తే ఊరువిడచి వెళ్ళిపోయాడని చెప్పేడు.

ఇందీ—అయ్యో. ఎంతమోసం జరిగింది. అయితే యీ రు 500 లు కూడా గంగపాలేయన్నమాట.

ప్రభా—ఇందిరా! యిదంతా నాప్రారబ్ధము. [illegible] సంప్రాప్తమౌ కుడ నగుదునని తలలోకూడ తలంచ లేదు. [illegible] కన్నడకుండా దాచిన, నీవంటి మానవశ్రేష్ఠులకు [illegible] కాలము గడిపేను. యీ [illegible] కొఱ కనేక ప్రయత్నాలు చేసాను. [illegible] అధికారివద్దకు పోయినా—

సీ. వేనవేల్ లంచముల్ ♦ విరజిల్లినఁ వేళ
నిస లేదనిపలుకు ♦ [illegible]
కుటిలవృత్తి వహించి ♦ [illegible]
యాంధ్ర దాస్యము సల్పి ♦ యధము [illegible]
నీవె ఘనుడవంచు ♦ భావముల రసల్ప.
నుద్యోగమిడెడి యా ♦ [illegible]
మానాభిమానముల్ ♦ మాని తనను సేవ
జేయు మంచనియొడి ♦ [illegible]
గీ. బ్రాహ్మణుల కొనగూడునె ♦ బనులటన్న
దుర్నయము దెలుపు మత వి ♦ ద్రోహి [illegible]
నుండ నధికారు లిట్టివా ♦ రుర్విలోన
జాబు దొరకునే? మన కోర! ♦ శ్రమయెగాని!

ఇంది—నిజమే. ఏమూల చూచినా ధనాశ, మోసము, మద్యపానము, వ్యభిచారము, నిరుద్యోగస్థితి. అబ్బబ్బ! అన్ని దురాచారాలు తాండవమాడుచున్నాయికదా! అందులోనూ యీ మద్రాసు నగర మన్నిటికి ప్రసిద్ధి కెక్కినది.

ప్రభా—మద్రాసునగరమే కాదు. ప్రపంచమంతటా యింతే.

ఇంది—అవును. వినాశకాలము దాపురించబట్టే యింత అనాచారము ప్రబలి పోయింది.

ప్రభా—అదటుంచు ఇందిరా! నాకింతవఱ కుద్యోగము దొరకలేదు కదా! యిక ముందు మన పొట్టపోషించుకోవడ మెలాగో తోచటంలేదు.

ఇంది—వెర్రివాడా! విచారించి మనమేమిచేయగలము? ఆసర్వేశ్వరు డేమి చేయదలచుకొన్నాడో అదవకతప్పదు.

ప్రభా—ఇందిరా! నావంటి నిర్భాగ్యునితో యేల వచ్చితివి? నీతల్లి చెప్పినట్లు విని నీమామను పెండ్లియాడిన నెంతసౌఖ్యమనుభ వించెడిదానవో కదా! యీ నిర్భాగ్యుని గట్టికొని నీ వెన్ని కష్టములు పడవలసివచ్చునో!

ఇంది—బావా! నేడిట్లు మాట్లాడుచున్నావేమి? నన్ను పరీక్షింప దలచుచున్నావా? నీవేనా సర్వస్వమని నమ్మియున్న నన్నిట్లన దగునా? నాహృదయము నీకిదివరకే సమర్పింపం బడినది. కష్టమైననుసుఖమైనను నీతోడిదేనాకు. (అని దగ్గరగాచేరును)

ప్రభా—(సంతోషముతో) ఇందిరా! నీప్రేమెంత యద్వితీయమైనది. అందుచేతనే ప్రేమమూర్తియైన భగవంతుడు తిరిగి మనిద్దరిని చేర్చినాడు.

ఇంది—ప్రభాకరా! మరచితిని. మన జంట గలపినవాడు వీరన్న సుమా! అతడు మనకు మహోపకారము చేసినాడు. చిరస్తవ నీయుడు.

ప్రభా—అవును. ఆనాడు నీయుత్తరము పోలీసులకు జూపించి, వారి నొప్పగింతునని నేను పోబోవుచుండగా నన్నాపి తానే ఆపనం

# మేనరికం

## చతుర్థాంకము

### మొదటి రంగము

ప్రదేశము: గోపీచంద్ గృహము

ప్రవేశము: గోపీచంద్, సురేష్, శ్యామల, వీరన్న.

సురే—శేఠ్‌జీ! మీరుచేసిన మహోపకారానికి నేనెన్నటికీ కృతజ్ఞుడను. ఆదుర్మార్గుడు నన్నలా చేసినప్పుడు మీరు వచ్చి తగిన శ్రద్ధతీసుకొని, మంచిడాక్టరు నేర్పాటుచేసి, తిరిగి నాప్రాణాలు నిలబెట్టేరు.

గోపీ—ఏంటిసెప్పేరు మీరు. మీకు మేమ్ చేసినా ఉపకారం లెక్క చేయవల్సింది కాదు.

వీర—బాబయ్యోయి! శేఠ్ గారూ మీకూరికే ఉపకారం సెయ్యలేదు. కాబోయే అల్లుడిగార్కి ఆమాత్రం సెయ్యకపోతే అమ్మాయిగార్కి కోపం రాదంటయ్యా బాబూ!

గోపీ—నిజం, అంతా సత్యం. మాందీ బేటీ మిమ్మల్ని బడిలోచూసినప్పటినుంచి మీరు తప్ప మరొకర్ని పెళ్ళిచేసుకోనని సెప్పింది. అందుచేత యింత సేయవలసి వొచ్చింది.

సురే—శ్యామలా! అనేకసార్లు త్రాగివచ్చి విన్నరానిమాటలన్నాను. కొట్టేనుకూడా. అవన్నీ తలచుకొంటే నాగుండె నీరయిపోతూంది. నన్ను క్షమించవూ శ్యామలా!

శ్యామ—సురేష్! నిన్ను నేను క్షమించుటయా! ఎంతమాట? అందర్నీ ఆభగవంతుడే క్షమిస్తాడు.

సురే—ఆహా! నా పైశాచికకృత్యముల తలంచుకొంటె, నాఒళ్ళు కంపమెత్తుతూంది. చిన్ననాడు చేరదీసిన మాధవరావునుచం పేను. ప్రేమైకజీవులు ఇందిరా ప్రభాకరులను వేరుచేసాను. ఆహా!

వీర—బాబయ్యా! మీరింతచేయడానికి కారణం యేమిటి బాబయ్యా!

సురే—వీరన్నా! దీనికంతకూ దుష్టసహవాసమే కారణం.

గోపీ—నిజం. ఆశేఖరంగాడిస్నేహంచేసిందీయింతె.

సురే—నిజమే. ఆతనితో స్నేహంచేసి, అన్నిదురలవాట్లకలోనై, చదువుకని మాధవరావుగారిచ్చేది త్రాగుడికి ఖర్చుపెడ్తూ, చదువుమానేసి, త్రాగుబోతునై, సహోదరివంటి యిందిర కై తంటాలుపడి, తిరస్కరింపబడి, ఆక్రోషముతో తండ్రివంటి మాధవరావునిజంపి, యిందిర నపహరించుకొనివచ్చి, ఆకు టుంబాన్నంతటిని, సర్వనాశనంచేసాను. కూకటివేళ్ళతో దో చుకొని దుర్గాంబననాథురాలిగాచేసి ఆమెను ప్రభాకరంనుండి వేరుచేసాను. వెంటనే దానికి ప్రతిఫలం అనుభవించేను.

శ్యామ—సురేష్! ఆశేఖరం స్నేహంవొద్దని నేనెన్నిసార్లు చెప్పినా విన్నావా? చివర కతని గుణం కనబడిందా?

వీర—బాబూ! నానిదంతా గయించే, మిమ్మల్ని ఆచంద్రశేఖరం గాడే పాడుచేసాడని అంతా ఆడిమీద రిపోర్టుచేసాను. అం దులో మిమ్మల్ని కలపలేదు.

సురే—నిజమే. నీవావిషయంలో నాకుచాలామహోపకారంచేసావు.

వీర—అడటుంచి బాబూ! మీకా శేఖరంగాడిస్నేహంఎలాదొరికింది బాబూ!

సురే—చంద్రశేఖరంది పల్లెటూరు. ఆతని తల్లిదండ్రులు శేఖరాన్ని పట్నవాసం చదువుకని పంపించేరు. అతనిక్కడ దుష్టస్నేహితు లలోతిర్గి, అన్నిటిలోనూ ఆరితేరి, తల్లిదండ్రులు చదువుకని పంపించేది వాటికి ఖర్చుపెడుతూ చదువుకు స్వస్తిచెప్పేడు. ఆతడు నాకు School లో పరిచితుడైనాడు. అదిమొదలు

నన్నుకూడా భ్రష్టునిగాచేసి చివరకు మిత్రద్రోహానికే పూను కొన్నాడు.

గోపీ—హెడ్మాష్టరుండాకొడుకు ఎంతాపనిచేశాడు. ఇలాంటి వెధవలికి చదువుకి పాడుచేసేదానికి వక్కీల్కు ఇస్తే మంచిది.

వీర—నిజం బాబు. నిజం చదువులని సెప్పి ఇప్పటోళ్ళందరూ ఇలాగే చేస్తున్నారు. యీళ్ళు పెద్దచదువులు చదివిన యేఉద్యోగంలేక, చక్కగా క్రాపింగుదువ్వి, కూడకట్టుకొని, సిగరెట్టో, లేకపోతే బీడీయో అదీ లేకపోతే చుట్టో.

గోపీ—అదీ లేకపోతే Secondhand చుట్టపీక.

వీర—ఏదీ లేకపోతే అంతేసంఢి. ఏదోకాలుస్తూ ఎవడికొంప మూవుదామాఅని ఆలోచిస్తుంటారు. ఇంటికాడమ్మా బాబూ పడే పాట్లీళ్ళకేమిటి తెలుస్తాయి.

శ్యామ—కాని వీరన్నా! నీదయవలననే సురేష్ యీనాటికైనా బాగుపడ్డాడు.

వీర—నాదయేంటమ్మా! ఆభగవంతుడి దయ.

సురే—వీరన్నా! నీవెవరో నాకర్థంకాకుండాఉంది. మేము మాధవరావుగారింట్లో కన్నం వేసిన మరునాడే మావద్ద ప్రవేశించి, అతినమ్మకంగా ప్రవర్తించి, ఇందిరను తప్పించడానికి శేఖరాన్ని పట్టించడానికి సిద్ధపడ్డావు. అసలు నీసంగతేమిటి?

వీర—బాబయ్యా! నాసంగతికేటుంది. దిక్కులేనోడిని. ఇంకా నా సంగతి మీకు ముందు తెలుస్తుంది. ఆశేఖరంగాడన్నట్టుకొంటే నేగాని, నాసంగతి తేల్దు.

శ్యామ—ఇంతకూ శేఖరం యెక్కడున్నాడో?

సురే—శ్యామలా! ఇంకా మిత్రద్రోహిసంగతెత్తవద్దు. వీరన్నా! నీ మాటల్నిపట్టిచూస్తే ఇందిరను ప్రభాకరం తీసుకుపోయుంటాడని తెలుస్తూంది. ఆవిధముగా వారిని కలిపి కొంత యుపకార

గోపీ—(ఆలోచించి) యింతామంది చెప్తున్నారు. మంచిదీ, సరే. అలాగే చేయండి.

సురే—అయితే యీవేళే మద్రాసు ప్రయాణం.

గోపీ—అచ్ఛా! లేవండి. సురేష్ యిటురా! శ్యామలా? యిటరావురే. (అని యిరువురను ఎదురుగా నిలుచుండబెట్టి) అబ్బాయి!

వీర—కాదుబాబూ. అల్లుడు.

గోపీ—ఆ. అదే, విల్లాడ్ తన్ను మా చేతే మనసారా ప్రేమచేసి యింతకష్టపడి బారిలోకి తీసుక్కొ వచ్చింది. నాకూ యింకా ఎవరూ లేరు. యీ ఉన్నదైనా అంతా నీదే. మీరు సుఖంగా ఉండి యీ డబ్బుతో జాగ్రతగా నీకూ యిష్టం వొచ్చినా వ్యాపారం చేసుకో. యిక నాకూ దేన్కి సంబంధం లేదు. పెద్దా కాలం అయింది. సుఖంగా కాలం గడపడాన్కి నిశ్చయం చేసుకొన్నాం. మీకోర్కె ప్రకారం, ఆ-ఉండు-అమ్మాయి! నీకు సురేష్ అంటే యిష్టమేకదూ?

శ్యామ—ఆ. యిష్టమే.

గోపీ—సురేష్! నీకు మున్కి బేబిని పెళ్ళిచేసుకోనడం యిష్టమేనా?

శ్యామ—నాకు చాలా చాలా యిష్టం.

గోపీ—(సంతోషముతో) అచ్ఛా! అచ్ఛా! మీకు మీకూ యిష్టం అయితే మాకూ యేమిటీకష్టం. మీయిద్దర్ని మొగుడు పెళ్ళాం చేస్తున్నాం. (అని చేతులు కలుపును)

వీర—మా మంచిపని చేసారుబాబూ!

గోపీ—వీరన్నా! రా! మనం ప్రయాణానికి అన్నీ సిద్ధం చేద్దాం.

వీర—పదండి నా రాజా! పానకంలో పుడకలాగ మనమెందుకిక్కడ.

(గోపీచంద్, వీరన్న, నిష్క్రమింతురు)

సురే—(శ్యామలను చేరదీసి) శ్యామలా! నీ ప్రేమను గుర్తించుకో లేక యిన్నాళ్ళు అంధుడనై మసలేను. నేటికి నీవు ప్రణయ

సామ్రాజ్యంలో విజయపతాకం నా టీవు. అజ్ఞానతిమిరమును బాపిన అమరజ్యోతివి.

శ్యామ—సురేష్! నేటికి నాకోరిక ఫలించింది. కటిక చీకటిలో చంద్రోదయమైంది. నాకు చాలా ఆనందంగా ఉంది.

సురే—నిజమే. యీవేళ మనకు శుభదినం. అత్యంతానందదాయక మైనదినం. ఏదీ ఒక్క ముద్దు.

(తెరపడును)

---

## రెండవరంకము

ప్రదేశం : రాజబాట

ప్రవేశం : యిందిరా ప్రభాకరులు, భిక్షుక వేషముతో పాడుచూ

ప్రభా—(ఆగి) మహాశయులారా! క్షుద్బాధచే తపించుచున్న యీ దీనుల మొరాలకింపరా? అయ్యయో! నాల్గుదినములనుండి పట్టెడన్నమైన లేదే! కనికరించరా! (మరల పాడుచూ నిష్క్రమించును)

(తెర యెత్తగా మరియొక వీధి కనబడును. మరల యిందిరా ప్రభాకరులు ప్రవేశింతురు)

ప్రభా—(కొంతదూరము నడచి) అక్కటా! ఎంత దూరము నడచి నను పిడికెడు కబళమైన లభించుట లేదే? ఛీ! పాడుబ్రతుకు ఎంత నిరర్థకమైనది. సిగ్గువిడచి చేయిజూచినను ఆదరించు వారు లేరయ్యెగదా!

ఇంది—బావా! విచారించకు. ముందుకునడు. ఆవీధికూడ చూతము.

(మరల పాడుచూ కొంచెము ముందుకు నడచుచున్నారు. అంత శేఖరం, మారువేషముతో ప్రవేశించి, కొంతదూరము నడచి, చటుక్కున ఆగి, ఇందిరను జూచి, నిదానించి)

శేఖ—అరే! ఇందిరా ప్రభాకరులవలె నున్నారే! (నిదానించి) ఆ. వారే. సరే. యిదే సమయము నేను చంద్రశేఖరం నని వీరికి తెలియదు. వీరి కిప్పుడు మంచి టోకరా యీయవలెను. యిందిరను చేరదీయాలి. (సమీపించును)

ప్రభా—(నమస్కరించి) మహాశయా! యీదీనుల కనికరింపుడు.

శేఖ—(కనికరము నటించుచు) యిదిగో! తీసుకో. (అని రు 5 లు నోటిచ్చును)

ప్రభా—మహాత్మా! తాము శ్రీమంతులయ్యు నింతటి ఉదారస్వభావు లగుట నాయదృష్టము. నావంటి నిరుపేదవానికి మీరొనర్చిన సహాయమునకు భగవంతుడు మెచ్చుగాక!

శేఖ—(మీసము దువ్వుచూ, యిందిరవంక జూచుచు) మిమ్ములను చూడగనే నాకు జాలికల్గుచున్నది. గొప్పయింటి బిడ్డలవలె గన్పడుచున్నారు. మీ చరిత్ర నే వినవచ్చునా?

ప్రభా—మహాత్మా! తామనుకొనినట్లు మేము శ్రీమంతులబిడ్డలమే. కాలకర్మవశమున నిట్లైతిమి. మాచరిత్ర వినినవారికి కూడా పాపము సంభవించును.

శేఖ—నీవు చదువుకొనినవానివలె నున్నావే.

ప్రభా—ఆ? అన్నియు వెలిగించిన ముఖమే యిది.

శేఖ—అయ్యో! పాపం యీ పిల్లనీభార్య అనుకొందును.

ప్రభా—చిత్తము.

శేఖ—పేరు తెలిసికొనవచ్చునా!

ప్రభా—ఇందిర.

శేఖ—(తనలో) అనుమానము తీరిపోయింది. యింక నాటకమున కుపోద్ఘాతము ప్రారంభించాలి. (పైకి) వెర్రివాడా! ఎంతపని చేస్తున్నావోయి! నీవు కష్టపడుచున్నదేగాక, కుసుమకోమలి యగు ఈకాంతను గూడ నిష్కారణముగా కష్టములపాలు

చేయుచున్నావే. చూడు ఆమె పాదములెట్లు బొబ్బలెక్కి మోమెట్లు కందిపోయినదో అయ్యయ్యో!

ప్రభా—మహాశయా! ఏమిచేయుదుము? యిది నుదుటివ్రాత. దాని నుల్లంఘింప మాతరమా?

శేఖ—మిమ్మల్ని చూస్తే నాకడుపు తరుక్కుపోవుచున్నది. మీరు సుఖపడటానికి నేనొక యుపాయం చెబుతాను వింటారా?

ప్రభా—తప్పక.

శేఖ—నేనెవరినో తెలియకపోవచ్చు.

ప్రభా—తెలిసికొన అవసరమువచ్చినచో, పిలుచుచో తెలియచేయుము.

శేఖ—నాపేరు జగద్విదితము. ఆసేతుహిమాచలపర్యంతము అంటె from North Pole to south Pole. నన్నెరుగుదురు, ప్రతీ కాఫీ హోటల్లోను, ప్రతీ కిల్లీషాపులోను, ప్రతీబోగందానింట్లో, ప్రతీబ్రాందీకొట్టువద్దా, ప్రతిబ్రాకెటు కంపెనీదగ్గర, వేయేల, పిపీలికాది బ్రహ్మపర్యంతము నాఫోటోలున్నాయి. నేను బయల్దేరానంటే వెనకాల అనేక వేలమంది పడ్తారు నన్ను చూడటానికి. సంసారందగ్గరనుంచి సానివారకూ నన్నే కోరుతూ ఉంటారు.

ప్రభా—ఆహా! అలాగా! తమ నామధేయము.

శేఖ—మిష్టర్ 'చంద్రం'.

ప్రభా—క్రొత్తపేరులాగుందే?

శేఖ—అబ్బబ్బే! నన్నా బాలగోపాలం ఎరుగుదురు. నేనీమధ్యనే 'ఎడారి పోరంబోకులు', 'లోలకులపిల్ల' మొదలైన ఫిల్ములు డైరెక్టుచేసాను. నాపేరు పేపర్లోకూడ పడింది.

ప్రభా—ఇంతకూ మీరు ఫిల్ము డైరక్టరా?

శేఖ—మరే! నాచేతిలో తయారయిన యేStar అయినా సరే చెడిపోయిందనిపించండి, వాళ్ళనైనా stars గా తయారు

చేస్తాను. నేనందరి డైరక్టర్ల వంటివాడను కాను. ప్రొడ్యూసర్లని దగాచేయడం female పాత్రధారిణిలను పాడుచేయడం, మొదలైన దొంగ వేషాలేవీ నాదగ్గర లేవు. గోచీపెట్టుకోవడ మైన చేతగాని పాకీవాడిని దొరస్సానివాడిని, త్రాగుబోతుని డైరక్టర్లుగా పెట్టి ఫిల్ము తీసేవాడిని కాను.

ప్రభా—ఇంతకూ తమరు శెలవిచ్చేదేమిటి?

శేఖ—ఈఅమ్మాయి అందానికి మన ప్రస్తుత ఆంధ్రతారలెవ్వరు సరి పోరు. పాటకూడా తమిళ తారలను, ఆంధ్ర తారలను కూడా పొడ్డిటుతుంది. ఇటువంటి రత్నాన్నిలా దాచిఉంచడంకంటె, నలుగురిలో పెడితే మంచిదని నాఉద్దేశం.

ప్రభా—మహాశయా! మాకీ సినిమా ప్రపంచములో ఉండడం ఇష్టం లేదు. క్షమించండి.

శేఖ—ఓయి! వెర్రివాడా! ఆలోచించుకోకుండా మాట్లాడుచున్నావు. యీమెను తయారుచేసి, ప్రస్తుతం పేరులో ఉన్న actress నందరినీ down చేసేద్దాము. ఇదిగో! మీకు కావలసినంత డబ్బిస్తాను. త్వరలో నేను "మోసం" అనే ఫిల్ము తీయబో తున్నాను. అందులో యీమెను heroine గా వేయిస్తాను.

ప్రభా—అయ్యో! మీఫిల్ము పేరు వినడంతోనే మీప్రజ్ఞ తెలుస్తూంది మమ్మల్నీ అగౌరవప్రపంచములో దింపకండి.

శేఖ—ఎంత మాటన్నావు? అగౌరవమా? సినీమాలో చేరినంతమా త్రాన అగౌరవమా? ఎంతమంది గౌరవనీయులు, విద్యాధికులు సినీమాతారలుగా లేరూ?

ప్రభా—అయ్యో! ఫిల్ము డైరక్టర్లందరూ మాట్లాడే తీరిదే, తాడి చెట్టుమొదల్లో కూచోపెడతామని అరచేత స్వర్గము చూపిస్తా మని అంటారు.

శేఖ—ఇంకా ఆమాటలే మాట్లాడేవు. నేనందరి డైరక్టర్ల వంటివాడను కాను. కొన్నాళ్ళు నాతో ఉంటే నా సంగతి మీకే తెలుస్తుంది.

ఇంది—బావా! పోనీ యీసంగతికూడా దేనికైనా చూద్దాం. మానసు నచ్చితే ఉండొచ్చును. లేకపోతే మానెయ్యొచ్చును.

శేఖ—(తనలో) పిట్టవలలో పడుతూంది. (పైకి) నిజమే. మీ కేలోటూ చేయను. ఆమెను రు 5000 లకు Book చేస్తున్నాను. రేపే advance యిచ్చి agreement వ్రాయించుకుంటాను. యీ దెబ్బతో డైరక్టరు 'చంద్రం' పేరు, మీ పేర్లు కూడ బయలు పడాలి. ఆ, నీకు కవిత్వమేమైనా వచ్చునా?

ప్రభా—ఏదో! పిచ్చివాగుడు వాగుతాను. స్కూలులో నేర్పిన ఛందస్సే. నేను వేరేగా దీనికోసం ప్రయత్నించలేదు. ఏమీ తోచనప్పుడేదో వ్రాసుకుంటూ, పెద్దలచేత అవి దిద్దించు కొంటూంటాను. నేను పెద్దగవిని గాను.

శేఖ—చాలోయి. ఆకవిత్వం చాలు. మన సినీమారంగానికి. ఆ! ఇక నేమి? అయితే దానికో వేయి రూపాయలిస్తాను. వాస్స ద్దయినా లేనివాళ్ళందరూ యాక్టర్లయి పేరులోకి వస్తుంటె ఇన్నిఉన్న మీరు వీళ్ళందర్నీ కాలదన్నడం అబ్బురమా? ఊఁ, నడుమరి స్టూడియోకి.

ప్రభా—ఇందిరా! నీయభిప్రాయమేమి?

ఇంది—బావా! మన ప్రస్తుతావస్థ కలా చేయడం సమంజసమని తోస్తూంది. మన కేమైనా వ్యతిరేక మొచ్చిందంటే వెంటనే మానెయ్యొచ్చు.

ప్రభా—సరే, అయ్యా! అలాగే కానివ్వండి.

శేఖ—ఇప్పటికి నీబుద్ధి తిరిగింది. ఇంక చూడువుగాని, 'చంద్రం' గారి డైరక్షను. అదిగో ఆకనబడుచున్నదే మా స్టూడియో, అద్దాన్నం స్టూడియో. ఇదిగో ఇది దారి రండి. నా వెంట (నడచుచు తనలో) అదృష్టజాతకుడను. అంతా unexpected సమావేశం. (ముందు డైరక్టరు నడచుచుండగా, వెనుక ఇందిరా ప్రభాకరులు నడచుచుందురు.)

ప్రభా—(నడుచుచూ) పరమేశ్వరా ! యీవిచిత్రసంఘటన మేల కల్పించితివో. పాలముంచిననూ నీటముంచిననూ నీవే శరణం

(అందరు నిష్క్రమింతురు)

(తెర పడును)

## మూడవ రంగము

ప్రదేశము : గృహము

ప్రవేశము : గోపీచంద్, వీరన్న.

గోపీ—అరే ! వీరన్నా ! మన్కి యివాళ కాలక్షేపం ఎట్లాగవోయి?

వీర—బాబయ్యా ! కాలక్షేపం అవాలీఅంటే, సైదునో పిల్లనెట్టుకొని నల్లగుఱ్ఱం వొకళ్ళు, తెల్లగుఱ్ఱం వొకళ్ళు ఎక్కి బీదికి పైరెళ్ళాలి.

గోపీ—యిప్డు పిల్ల ఎక్డవస్తుందివోయి !

వీర—అదే !మారాజా ! వొచ్చినగొప్పచిక్కు. గెహాచారం.

గోపీ—పోనీ, కంపెనీకి తీసుకొని వెళ్తే.

వీర—అరెనాసామిరంగో ! వాళ్ళనిపోషించండి బాబయ్యా !

గోపీ—అయితే ఏమ్టిచేద్దాంవోయి.

వీర—మారాజా ! మాపేటలో సందాలకూకుంటె రకరకాల పిల్లలొస్తారు. గడ్డట్టుకొని వాళ్ళనిచూత్తే నాఒళ్ళు గుమ్మయిపోతాది. మారాజా !

గోపీ—తూ. గడ్డిమోసుకొనేవాళ్కి అందం హెక్కడుంటుంది.

వీర—మారాజా ! అలాఅనకండి. మళ్ళీ పెళ్ళిచీర కట్టించి, కొప్పిలో మల్లిమొగ్గలుముడిచి, అందెలు కడియాలు తగిలించి, దాన్నప్డుడు చూడుసామీ. అపసరనే.

గోపీ—అరే. అపసరసాగాదు పప్పాసార్ అదికాదూ మంచిచీర కట్కుని, షోకూచేసీ, తలుక్, తలుక్, లోలకులు తగిలించి,

టప్ టప్ మని నడుస్తుంటె దాన్ని మజా సెయ్యాలి. గుగ్గంపల వాళ్ళకి అందం ఎక్కువోయి. సేస్తే భోగందానికి మజా సెయ్యాలి.

వీర—స్వామీ! ఆళ్ళకున్న కండ యీ భోగంముండాళ్ళకుంటుందా? పెద్ద సిగచుట్టేసి. పువ్వులెట్టుకోగానే సరా! అప్పడం ముక్కలా గుంటారు.

గోపీ—సరేగాని వీరన్నా! నీకు పెళ్ళాం ఉందివోయి?

వీర—ఉంది ఆళ్ళపుట్టింటికాడ.

గోపీ—మరి తీసుకురావేమి?

వీర—సామీ పెళ్ళిచేసుకోందే?

గోపీ—పెళ్ళిచేసుకోందే పెళ్లాం ఎలాగ అయ్యింది.

వీర—నవ్ చేసాను మారాజా.

గోపీ—నవ్ అంటె.

వీర—పేమ.

గోపీ—అచ్చా! అచ్చా! ప్రేమ.

వీర—అదే. అదె. యింకొన్నాళ్ళలో కలుసుకొంటాం నూ నెప్పుని మారాజా!

గోపీ—ఇప్పు నీవు నేను ఒకటిలాగ ఉన్నాం.

వీర—మరే సామి.

గోపీ—అయితేనడు. యిద్దరం నల్లగుఱ్ఱ తెల్లగుఱ్ఱం ఎక్కి సైరు వెళ్దాం.

వీర—అమ్మో! మనిద్దరం సైరెత్తే ఫలం లేదు. అక్కడికెళ్ళే సైరుకి ఆడాళ్ళు, మొగాళ్ళు ఉండాలి.

గోపీ—పోనీ మనం మొగాళ్ళు సైరు వెళ్దాం.

వీర—సరే లెండి.

గోపీ—అయితే నల్లగుఱ్ఱం, తెల్లగుఱ్ఱం యెక్క దొరుకుతాయివోయి

వీర—యీ పేట చివర్లో పెద్దషాపుంది.

గోపీ—షాపూ ఉంది ఒక్కి గుఱ్ఱం యెంతఉంటుంది?

వీర—మజానుబట్టి అణారికం కూడా ఉంది.

గోపీ—అరే అణాకి గుఱ్ఱం వొస్తాది. అయితే మాంకు రెండు గుఱ్ఱాలు తీసుకురా. మనం యిద్దరం సైరు వెడదాం. వాటికి దాణ్ణో పాగ పేయిద్దాం.

వీర—వాటికి వేరే పాక అక్కర్లేదు బాబూ. మీా పొట్టలో ఉంటా యవి.

గోపీ—అరే గుఱ్ఱాలు పొట్టలో ఉంటాయి. తమాసా సేస్తున్నావు వోయి.

వీర—(నవ్వుచు) సామీా క్షమించాలి నల్లగుఱ్ఱం అంటె సారా. తెల్లగుఱ్ఱం అంటె కల్లు.

గోపీ—అరే. ఎంత తమాషా చేసావూవోయి కల్లుసారా తాగి సైరు వెళ్ళాలి ?

వీర—బాబూ క్షమించాలి వేళాకోళం చేసాను.

గోపీ—క్షమించేము. సైరూఒద్దు. ఏమీాఒద్దు. మంచిపాటపాడువోయి.

వీర—నాకేమీా పాటలు రావండి.

గోపీ—సినీమా పాటలు పాడువోయి.

వీర—నాకేమీా రావండి.

గోపీ—అరే నువ్వు యెప్పు సినీమాకి వెళ్ళలేదురా ?

వీర—ఆ. వెళ్ళేనండోయి. ఒక్కసినీమాకి.

గోపీ—యింకాఏమి అందులో పాటపాడువోయి.

వీర—ఒక్కటే పాటొచ్చునండి.

గోపీ—ఆ. పాడు మరీ.

వీర—యినండి. (గొంతుక సవరించుకొని) ధిక్కారమును సైతునా! ధిక్కారమును సైతునా!

(అని పాడుచూగోపీచంద్ పైకిపోవును. గోపీచంద్ గంతులు వేయును)

వీర—(పాట ఆపి) ఏమండీ ! పాడమన్నారుకదూ !

గోపీ—అదేమిపాటవోయిధబేయి. ధబేయిమనిపించి. ప్రాణంతీసేవు.

వీర—యిది కంసులోరి పాటండి.

గోపీ—అరే అదీవొద్దు యింకొకటి పాడువోయి.

వీర—(ఆలాపన చేయును)

గోపీ—(సంతోషముతో) అద్దదీ. అద్దదీ. అబ్బా! అరే! వీరన్నా యీ పాటలో శృంగారం, గింగారం, చమక్ అంతా ఉండాలి. బహుత్ కుషీగా ఉండాలి. ఆ పాడు రా

వీర—అయితే వినండి. (వీరన్న పాడుచుండును. గోపీచంద్ గంతు లిడుచుండును)

(సురేష్, శ్యాముల ప్రవేశింతురు)

గోపీ—(చటాలున జూచి, వీరన్న నోరునొక్కి, సంతోషము నభిన యించుచు) ఆవ్ బేటీ. ఆవ్.

శ్యామ—నాన్నగారి వేళ ఆంజనేయునరాగం దాల్చినట్లున్నారే!

సురే—అంతా సరిపోయింది గాని తోకమాత్రం తక్కువైంది.

గోపీ—మళ్ళీ తోక గీక అంటావు. పాటవింటూంటె.

సురే—ఆపేసేరేం. కానివ్వండి.

గోపీ—అయిపోయింది పాట.

వీర—బాబూ మాబాగా డ్యాన్సు చేసేరండి.

గోపీ—ఉస్ ఊరుకోరా. (శ్యాములను చూచి) బేటీ! యెక్కడికి ప్రయాణం.

సురే—సినీమా కెడదామని.

గోపీ—వీరన్నా! మనం యెక్కడిక్కి వెళ్దాంవోయి.

వీర—గుఱ్ఱాలమీద బీచికెడదాము.

గోపీ—అదుగో మళ్ళీగుఱ్ఱం అంటావు.

వీర—లేదండి. (నోరు నొక్కుకొనుచు)

శ్యామ—ముందు బీచికెళ్ళి అక్కడనుంచి అలాసినిమా కెడదామండి.

గోపి—అచ్చా! బేటీ! అచ్చా! నడు. నేను మీతో వస్తాను నడు.

సురే—అచ్చా! మహారాజ్ దయచేయండి.

శ్యామ—రండి టైమైపోతూంది. (అందరూబయలుదేరుదురు)

వీర—బాబయ్యా! నానలాగ పిలుముకంపినీల కేసెల్లొత్తాను.

గోపీ—అరె అక్కడికి ఎందుకులే. మజా ఉందా అక్క.

వీర—అదికాదుసామీ. అక్కడ ఎవరో 'చంద్రం' గారంట డిరక్టే రంట ఆయనో మొగోడిని, ఆడదాన్ని సినేమాలో యేసంకి తీసుకొచ్చాడంట. ఆపిల్ల చాలా బాగుంటుందంట ఆమొగాడు బి. యే. ప్యాసయి యేపనీలేక సినీమాల్లో యేసంయేస్తున్నా డుట. యీసంగతంతా కాఫీహోటల్ దగ్గర వోరో చెప్పుకుం టుంటే విన్నాను. వాళ్ళమాటల్నిబట్టి చూస్తే మన యింది రమ్మ, ప్రభాకరం బాబేమో అని అనుమానంగా ఉంది. అంచేత చూచొద్దామని.

సురే—వీరన్నా! అలాగైతే నీవు తప్పకుండా వెళ్ళి సంగతి తెలుసు కొనిరా!

శ్యామ—వీరన్నా! తప్పకుండా అలాగచెయ్యి.

వీర—చిత్తం. బాబు చిత్తం.

గోపీ—నడు బేటీ. సికార్ వెళ్దాం. మేము యిలాగ వెళ్తాం. నువ్వలాగ వెళ్లూరా, వీరన్నా! గుఱ్ఱంమాత్రం ఎక్కకు. ఎక్కితే యెక్క డుంటావో తెల్సా. సైడుకాలువాలో.

వీర—మంచిది. బాబు మంచిది.

(వీరన్న ఒక ప్రక్కకు, చంద్, సురేష్, శ్యామల యింకొక ప్రక్కకు నిష్క్రమింతురు) (తెర పడును)





# మేనరికం



## పంచమాంకము



### మొదటి రంగము

ప్రదేశం : వసారా చావడి

ప్రవేశం : ప్రభాకరం

ప్రభా—(విచార వదనముతో) ఆహా! చివరకు నాగతి యిట్లాయెను! విద్యావంతుడనయ్యు చేతగానివానివలె, యీసినీమా రంగంలో యిన్నాళ్ళు కాలక్షేపం చేయును. (ఆగి) అతడిదిగో అదిగో అనుచున్నాడు. స్టూడియో లేదు. యాక్టర్సు లేరు. అంతా అబద్ధమే. వైఖరినిబట్టిచూస్తే యిందేదో మోసమున్నట్లు కనబడుచున్నది. advance కూడ యీయలేదు. ఆహా! శనిదేవత తాండవించుచున్నది. ఇకముందైన యింక నాకు సుఖదినములు రావు. (యించుక నడచి) దైవమా! శ్రమపడి చదివిన చదువు వ్యర్థమేనా? యిందులకేనా యీవిశ్వవిద్యాలయములు నావంటి యనాథు లెంతమంది యీకలిదేవతకు బలియగుచున్నారో గదా! అక్కటా! నిద్రాహారములుమాని ఉన్న యావదాస్తి వెచ్చించి, ఋణములపాలై సకలబాధలు పొంది, సంపాదించిన యీ 'డిగ్రీ' ల ప్రయోజనమేమి? (యించుక యోజించి) ఆహా! నాకేది లేకున్నను విద్యాధనమున్నది కదా యని కొంత సంతసించితిని. అదికూడా నిరుపయోగమైనది. నామూలముననే కదా, సుకుమారి నాయిందిర పరువు వదలుకొని, యీసినీమారంగంలోనికి దిగి ప్రతీవానితోను

యాస్తుచేయవలసివస్తూంది. యిన్ని కష్టములను బడుచు, నన్ను నమ్ముకొన్నవారిని కూడ కష్టపెట్టుచు, హీనదశ ననుభవించుచు, అనాథుడనై, నేనేల సజీవుడనై యుండవలెను. విద్యావంతుడనయ్యు నిష్ప్రయోజకుడనైన నేజీవించుటవల్ల భూదేవికి భారమే కాని వేరొండు లేదు. నాజీవితము నీనిరుద్యోగ పిశాచమునకు బలియిచ్చుటయే యుక్తము. కొంతభూభారమైన తగ్గును తన కడుపున యిట్టినిష్ప్రయోజకులు పుట్టిరని నాభారతిజనని కంటివెంట రక్తబిందువులెన్ని రాల్చుచున్నదో! అమ్మా! నిజమే నావంటి పుత్రులు నీపవిత్రగర్భమున జనించి నీకు కళంక మాపాదించుచున్నారు. ఏనాడును యిట్టివారింతల కనియెరుంగవు. తల్లీ మహాయోధులను యోధులను, పండితులను, మాతృభక్తి పరాయణులను గనినట్టి పావనమాతవు. యీనాడిట్టి ద్రెష్టలను కంటివి. తల్లీ! మా మూలముననేగదా విద్యాధికులయ్యు భారతదేశములో తిండి లేక మాడుచున్నారను కళంకము పూతచరిత్రవగు నీచరిత్రలో దాపురించినది. తల్లీ! విచారించకు. బ్రతికియుండియు నీదుఃఖమును బాపలేని నీపుత్రులను మరచిపొమ్ము.. తల్లీ జోహారు. యిదేనాకడసారి వందనములు. శలవు. నాప్రాణము లీఅనంత వాయువులో లీనము చేసికొందును. (పోబోవుచు తటాలున ఆగి) ఆ! నాయిందిర=నాఅర్ధాంగి-యిందిర గతియేమి? ఆమె ననాథనుచేసి విడచిపోవుటయేనా? ఆమె కిచ్చట దిక్కెవ్వరు? నేనే తన సర్వస్వమని నమ్మియున్న ఆమె తన్నుబాసిపోయితినని విలపించునో గదా! పరమేశ్వరా! ఎంతక్లిష్టపరిస్థితి దాపురింపజేసినావయ్యా.(మరల యోచించి) నేనుండియుమాత్రమామె నేమి సుఖపెట్టితిని. నావలన ఆమెకు కష్టమేగాని సుఖము

లేదు. నేనులేనిచో తనతల్లిని గలసికొని, హాయిగా సుఖించ గలదు, అవును నాజనని దుఃఖమును గ నుపశమించ గలదు. సర్వవిధముల నేను ప్రాణపరిత్యాగము చేయుటయే యుక్త మని తోచుచున్నది. అవును. అదేసమంజసము. (ఏడచుచు) యిందిరా! నీకు నాకును నేటితో ఋణము తీరినది. (అని యోచించి టేబిలువద్దకుపోయి రెండుత్తరములు వ్రాసినటుల నటించి) పరమేశ్వరా! మరియొకజన్మమునైనను నాయిందిరనే భార్యగా చేకూర్చుమయ్యా! యీజీవిని నీలో నైక్యముచేసు కొని భూభారము తగ్గించుమయ్యా! యిందిరా! యిందిరా! (అనుచు విడువలేక, విడువలేక యిల్లు విడిచిపోవును.)

(తెర పడును)

---

రెండవ రంగము.

ప్రదేశం : యిల్లు.

ప్రవేశం : చంద్రశేఖరం.

శేఖ—(నవ్వుచు. మీసము దువ్వుచు) ఫిల్ముడైరక్టరు. శేఖరం! నీ వెంతటికైనా తగుదువోయి. అదృష్టజాతకుడవనిన నీవేకదా! పోలీసు వారినుండి యుపాయముగా తప్పించుకొని, యీ మద్రాసునగరముచేరి, వేషభాషల నన్నిటిని పూర్తిగామార్చి వేసియున్న నిన్ను బట్టుట ఆదేవుని తరమా? ఆహా! యింకంతయు ఆనందమే. చేజారిన యిందిరకూడ లభించినది. (అని కొంతదూరము నడచి, క్రిందకాళ్ళకు ఏదో తగులుట చూచి) ఇది యేమి? (అని క్రిందనున్న రెండుత్తరములు తీసి మొదటి ఉత్తరము యిట్లు చదువును.)

మహాశయా!

ఆ కలిబాధచే తపించుచుండ నన్నాదరించి యింతవఱకూ పోషించిన మీకెంతయు కృతజ్ఞుడను. నేనింక జీవింపదలంచ లేదు.

అందులకే యీ యిల్లు విడిచి పోవుచున్నాను. తా మన్యథా తలంచ వలదు. నా భార్యను మీ కప్పగించు చున్నాను. ఆమెను పుట్టింటికి పంపివేయుడు. తమకీ శ్రమ యిచ్చినందులకు క్షమింప వేడుచున్నాను. నాకొఱకై ప్రయత్నింపవలదు, శలవు.

భగవంతుడు తమ యుదార స్వభావమునకు మెచ్చుగాక!

'ప్రభాకరం'

శేఖ—(నవ్వి) పీడ వదలినది. ఇం దేమున్నదో. (అని రెండవ యుత్తరము నిట్లు చదువును.)

ప్రియా! యిందిరా!

మన యిరువురకు ఋణానుబంధము నేటితో తీరిపోయినది. నేను జీవించియున్నకొలది మరింత కష్టము లధికమగుచున్నవి. కాన నేను చనిపోయినచో నీవు నీతల్లిని గలసి సుఖింతు వను నమ్మకముతో యీ యిల్లు విడిచిపోవుచున్నాను.

నాకొఱకై విచారించవలదు. నేనింక జీవించదలచుకొనలేదు. నాకొఱకు నీ వేమి ప్రయత్నములుచేసినా అవివ్యర్థమని గ్రహించుకో. నిన్నింతవఱకు కష్టపెట్టినందుకు క్షమించు, నన్ను మరచిపో. ఇంక నీసుందరముఖారవిందము వీక్షించుభాగ్యము నాకు లేదు. కాని మరియొక జన్మలోనైన నిన్నే భార్యగా జేయుమని భగవంతుని వేడుచున్నాను. నేనింత మోసము చేసానని దూషించకు.

'ప్రభాకరం'

శేఖ—(సంతోషముతో) శనిగ్రహము దానంతటదే వదలిపోయినది. ఇప్పు డిందిర ననుభవింప నాకాటంక మేమి గలదు? అట్లే చేసెదగాక (సోఫాపై కూర్చుండి) ఇందిరా! ఇందిరా!

(ఇందిర ప్రవేశించి, తలవంచుకొని దూరముగా నిలచియుండును.)

శేఖ—(మీసము దువ్వుచు) ఇందిరా! అంత సిగ్గేల? ఇదిగో యిటు చూడు, నేను పరాయివాడనా? ఏదీ ఒక్క క్రీగంటి చూపు.

ఇంది—(తనలో) ఇదేమి. ఈతడిట్లు మాట్లాడుచున్నాడు. పరమేశ్వరా! మరల యిట్టి ఘటన ప్రాప్తింప చేయుచున్నావేమి?

శేఖ—(లేచి) యిదిగో! ఏదో గొణుగుకొనుచున్నావు. అబ్బా! ఒక్కసారి యిలాచూస్తూ.

ఇంది—మహాశయా! అధిక ప్రసంగములు మాని, సెలవిమ్మని ఏదో చెప్పి పంపివేయడం యుక్తము.

శేఖ—ఆ. అవును నోడీ! నీపోర్షను ఒకసారి యిలా తీసుకోనిరా. రిహార్సిలు చేస్తాం.

ఇంది—మిగతా యాక్టర్సు యెవ్వరు లేకుండాను?

శేఖ—ఎందుకు? ముసిద్ధగం అడవిలో ఉన్నసీనే చేద్దాం.

ఇంది—ఆర్కెస్ట్రా లేదు. నాకు పోర్షన్ ఇంకా సరిగా రాలేదు. ఇంకో నాడు........

శేఖ—అబ్బెబ్బె! యిప్పుడే తప్పకుండా వేయాలి. ప్రాక్టీసుకోసమే రిహార్సిల్సు. ఇప్పుడు పాటలొద్దు. Prose డైలాగ్సు చేద్దాం. నీకా Tamil words బాగా నలుగుతాయి.

ఇంది—సరే! వస్తానుండండి. (లోనికిబోవును) (ఇందిర తిరిగిపోర్షన్ కాగితమును తీసికొని)

శేఖ—సరే. ఇప్పుడేముండాలి. సావిత్రీసత్యవంతు లడవిలో ప్రవేశం కదూ ఇది out door shooting సరే. ఇందిరా ఇది అరణ్యం అనుకో. అప్పుడెలా ప్రవేశిస్తాం. ఇటురా. (చేయి పట్టుకొని నడిపించి చూచి) అబ్బబ్బ! అలా కాదు రావడం. చూడు. ఇలా వయ్యారంగా పైట చేరవైచుకొని, చిరునగవుతో చక్కగా భర్తతో ప్రవేశించాలి (అని తను యాక్టుచేసి చూపించి) యిదీ యీసారి రా. (అని తను ఇందిర కెదురుగా దూరముగా మోకాళ్ళపై నిలచియుండి ఇందిర ప్రవేశించుట చూచి) face 45°angle లో ఉండాలి చూడు. ఆ పమిట వయ్యారంగా చేర వేయాలి.మళ్ళారా. (ఇందిర అట్లుచేయును. శేఖరం చూచి) ఆఁ అదీ Position బాగు.ది.

[అని తిరిగి యిఋవురు ప్రవేశించి]

శేఖ—యిప్పుడు పాటకాదూ. అది వదిలేసి తర్వాత ప్రోజు చెప్పు.

ఇంది—సామీ! యిందవనం, ఎవళ్ళవో. అళగాయి, యిరిక్కిపదుగో

శేఖ—చంపేసావు. పదుగో కాదు. పాదుంగో. (యిందిర సరిగా ఉచ్చారణ చేయలేకపోగా)

శేఖ—తెలుగు యాక్టర్సుని Tamil film లలో యాక్టుచేయిస్తే యిదే బాధ పదుగో కాదు. పా—రొం—గో. (అని విడదీసి ఇందిరిచే అనిపించి)

శేఖ—యీసారిపూర్తిగా ఆవాక్యమంతా చెప్పు.

(యిందిర పూర్తిగా పైవాక్యమును చెప్పుడు)

శేఖ—అబ్బెబ్బె! పాడుచేస్తున్నావు. ఆమాటలనేటప్పుడు నాముఖం వైపు చిరునవ్వుతో చూస్తూ, యిలా చేయిచూపిస్తూ, మోము త్రిప్పుచు, పెదవులు తమాషాగా కదిలిస్తూ అనాలి.

(ఇంది రట్లు చేయలేకపోగా, తాను చేసిచూపించి, యిందిర చేతట్లు చేయించును)

శేఖ—తర్వాత సత్యవంతుడిదికదూ? ఆ సరే. కన్మణీ! నీసొన్నది వాస్తవం. అంద కురువీపాల్. యిందవ్వూమణిక్. అంద పెరియ మరం, యిదెల్లాం ఎవళవో అరిమి ఆయిరిక్.

ఇంది—అబ్బ! ఆనక తూకుం వఋకె.

శేఖ—యథాప్రకార సిద్ధిరస్తు. తప్పుచెప్పేవు. 'ఎనక తూకుం వఋదె' అని చెప్పాలి. (ఇందిరచే జలవంతముపై అట్లనిపించిన పిదప)

శేఖ—సరే! అప్పుడే శయులాం. ఆ చూడు. యిందిరా! యిప్పుడు మనం అరణ్యామధ్యస్థంలోకి ప్రవేశిస్తున్నామన్నమాట. అందుచేత క్రూరమృగాలు కనపిస్తాయి. యిక్కడనీవు మంచియాక్షనుచేయాలి. పెద్దపులిని చూచినట్లు, భయపడి బెదరినట్లు, తమాషాగా చూడు, యిలా చెయ్యాలి. (అని తను యాక్టు చేసి చూపించి) మను యిద్దరం ప్రవేశిద్దాం.

[ముందు ఇందిర, వెనుక శేఖరం నడుచుచుందురు. ఇందిర బెదరినట్లు యాక్టుచేసి, చటుక్కున శేఖరం ఒడిలో పడును. శేఖరం ఇందిరను బిగియార కౌగలించుకొని ముద్దిడబోగా, ఇందిర విడలించుకొని చెంపపై కొట్టి దూరముగా నిలచి యుండును)

శేఖ—(గూబ సవరించుకొని) ఇందిరా! నే నెవడినో తెలుసా?

ఇంది—ఆ యిప్పుడు తెల్సింది. ఆడువాండ్రను మోసగింప దలంచిన అధమ డైరక్టరువని.

శేఖ—డైరక్టరునని తెల్సునుగదా! నే చెప్పినట్లు యాక్టుచేయాలని తెలియదా?

ఇంది—నీ యిష్టమొచ్చినట్లు act చేయుటానికి నే నొప్పుకోను. యిదిగో యిప్పుడే నీయిల్లువదలి వెళ్ళిపోవుచున్నాను. (పోబోవును)

శేఖ—(అడ్డుగావచ్చి, నిలబడి) పులినోటిలోనుండి అవతలపడడమే? యింతకూ యెక్కడికి?

ఇంది—తుచ్ఛుడా! అడ్డులే. నాకు వెనకాల మగడున్నాడన్ని తెలుసా?

శేఖ—మగ దక్షత. (నురలువిప్పి) ప్రభాకరమేనా? యిదిగో చూడీ ఉత్తరాన్ని, సంగతి తెలుస్తుంది. (ఉత్తరమిచ్చును)

ఇంది—(చదివి, కంగారుపడుచూ) అక్కటా! ఎంతపని జరిగింది?

శేఖ—(వికటముగా నవ్వును) యిప్పుడు నీ కిక్కడెవరుదిక్కు? రా నాతో సర్వసుఖా లనుభవిద్దువుగాని నాచేతిలోనుండి తప్పించుకోలేవు. రా నిన్ను చేరదీసిన నాఉద్దేశ్యం నెరవేర్చు.

ఇంది—అధముడా! నీవు గోముఖ వ్యాఘ్రమువని తెల్సుకోలేక పోయాను. నావంటి స్త్రీల మానభంగం చేయుడం నీకుశ్రేయస్కరము కాదుసుమా?

శేఖ—ఇందిరా! నీవు వేయిచెప్పు లక్షచెప్పు. నిన్ననుభవించనిదె విడచుటకల్ల, కా— సందేహించకు.

ఇంది—తుచ్ఛుడా! నా ప్రభాకరంతో బాటు నేను కూడా ప్రాణాలనైనా వదులుతానుగాని నీకు మాత్రం దక్కను.

శేఖ—అలాగా! యిప్పుడు నీ యబ్బ యెవడడ్డువస్తాడో చూస్తాను. (అని యిందిరను నిర్బంధించుచుండును. ఇందిర విడలించుకొన ప్రయత్నించుచు, 'అక్కటా' అని బిగ్గఱగా అరచును, వీరన్న పరుగునవచ్చి)

వీర—ఎవరురా అది. ఆగు.

(శేఖరం, ఇందిరను వదలివేయును. ఇందిర వణకుచు నిలచియుండును)

వీర—ఇందిరమ్మా!

ఇంది—వీరన్నా!

వీర—ఆ. నేనే కంగారుపడకు తల్లీ!

శేఖ—(ఆశ్చర్యముతో) వీరన్నా! (అని పరుగిడబోవ)

వీర—(ఆపి) నీచుడా! ఆడదాన్ని మానభంగం చేద్దామనుకున్నావా, చెప్పు నీవెవరో?

శేఖ—కళ్లు తెరచి మరీ మాట్లాడరా శుంఠ!

వీర—(మనిషినినిదానించి) ఆరిదొంగా! నీవు చంద్రశేఖరం కాదంట్రా?

ఇంది—శేఖరమా?

శేఖ—(కంగారుపడుచూ) మర్యాద తెలుసుకొని మాట్లాడరా!

వీర—ఆ. అన్నీ తెలుస్తాయి. నీమాటే నాకానవాలు. (శేఖరం మీసముపట్టి లాగగా నిజస్వరూపం బయట పడును) ఏరా! యిప్పు డెవరో తెలిసిందా? ఆయేల పోలీసోళ్ళకంట్లో కారం కొట్టి నీవు చేస్తున్నపనిదా? యీసారి తప్పించుకొందుగాని రండు. (అని పాగాగుడ్డ తీసి శేఖరం కాలుచేతులు కట్టివేసి, క్రిందపడవేయు శేఖరం తప్పించుకొన ప్రయత్నించుచుండును)

ఇంది—ఎంతమోసం.

వీర—తల్లీ ! నీ కీడెలాదాపరించేడమ్మా !

ఇంది—ఆనాడు నీదయవలన తప్పించుకొని ప్రభాకరునితో కలసియీ మద్రాసునగరముచేరి, యిక్కడే యుద్యోగము దొరకక భిక్షాటనము చేయుచుండగా, ఒకరోజున కనుపించి, తాను ఫిల్ముడైరక్టరునని చెప్పి తీసుకొనివచ్చినాడు.

వీర—ఎంతదారుణానికి పూనుకున్నాడు.........

ఇంది—యీదినమున ప్రభాకరు డింటలేకపోవుటచే.........

వీర—ఏమి ? ప్రభాకరం బాబేమయ్యాడు ?

ఇంది—ఇదిగో ! యీ letter చూడు.

వీర—(ఉత్తరం చూచి) అయ్యో ! ఎంతనాటకం జరుగుతోంది. యిచిత్రంగా వుందే ?

(యింతలో శేఖరం కట్లు విడిపించుకొని)

శేఖ—వెర్రివాడా ! నన్ను బంధింపగలవా?

(పరుగిడుచుండ వీరన్న వెంటాడును. ఎదురుగా ముందు గోపీచంద్, శ్యామల ప్రభాకరం సురేష్ ప్రవేశింతురు )

గోపీ—ఆగువోయి. ఆగు.

వీర—పట్టుకోండి.

(అంత శేఖరమును వెనుకకు తీసికొనివచ్చి మధ్యను నిల బెట్టుదురు.)

ఇంది—(ప్రభాకరునిజూచి) బావా !

ప్రభా—ఇందిరా !

ఇంది—బావా !

ప్రభా—ఇందిరా ! (కౌగిలించుకొందురు.)

గోపీ—వీడూ వొెవడూవోయి ?

సురే—యీాతడెవరు ?

వీర—మీస్నేహితుడు, శేఖరం బాబయ్యా!

గోపీ—అరే! దొంగాముండాకొడుక్కు మళ్ళీ యెలాగ వచ్చేడు ?

సురే—(ఆశ్చర్యంతో శేఖరంను సమీపించుచు)ఏమిటీ! శేఖరమా! తుచ్ఛుడా! డైరక్టరు 'చంద్రం' అంటే నీవేనా ? చేసినపాపాలకు పశ్చాత్తాపపడక యింకా నీకృత్రిమస్వభావముల వదలుకొనలేదా ?

ప్రభా—(సమీపించి) శేఖరం మా కటుంబాన్నంతా విధ్వంసము చేశావు. దానితో తనివితీరక యీవిధంగా మమ్మల్ని మోసం చేయదలంచుకొన్నావా?

వీర—మోసంచేయడమేకాదు బాబయ్యా! మీాయింట్లో లేనిసమయం చూసి, యిందిరమ్మను మానభంగం చేయడానికి సిద్ధమయ్యేడు.

ఇంది—నిజమే! వీరన్న సమయానికి వచ్చి రక్షించక పోయినట్లయితే, నేనీపాటి కెక్కడుండేదాన్నో !

శ్యా—అధముడా! యిప్పుడైన పశ్చాత్తాపపడు.

గోపీ—హెథ్యాముండాకొడుక్కి హీచారం కూడానా ?

సురే—శేఖరం! తల్లితండ్రుల మోసగించి, దురలవాట్లకు లోనై, చదువుమాని, నన్ను కూడ భ్రష్టునిగా నొనర్చి, కడువులోపలి చల్ల కదలకుండాయుండు మాధవరావుగారింట చిచ్చుముట్టించేవు. చివరకు మిత్రద్రోహానికే పూనుకున్నావు. ఆనాడు పోలీసువారినుండి తప్పించుకొని, యీమద్రాసునగరముచేరి, ఫిల్ము డైరక్టరుపేరుతో యెంతమందినో మోసంచేశావు. అంతటితో బోక యీనాడు యిందిరనుకూడ నిర్బంధింపదలచేవు. నీక్రూర చేష్టల కిక అంత్యములేదూ? నీపైశాచిక కృత్యముల తలంచుకొనిన నీఒడలు కంప మెత్తుటలేదా ?

వీర—యిప్పుడేం తెల్దు బాబయ్యా! ఆపోలీసోళ్ళ కప్పగిత్తే అంతా తెలుస్తుంది.

గోపీ—హీండ్కి అంతేచేయాలిరా! హీరన్నా !

శేఖ—(విచారంముతో) ఆహా! గొడ్డుగోతిలో బడినచో అందఱు తలొకరాయి విసరినట్లు మీాయెత్తిపొడుపుమాటలచే నాహృద

యము చిల్లులు పడిపోయినది. నిజమే! నేనొనర్చిన ఘాతుక
కృత్యముల నేయుగములో నేకిరాతుకుడు నొనర్చియుండడు.
(సురేష్ పాదములపై బడి) సుపుత్రమా! నీవు నాకు జ్ఞానోద
యం చేసావు. యీ చండాలుని కిక తరుణోపాయం లేదు.
సురేష్! నేనొనర్చిన యపరాధముల క్షమించు.

సురే—నేను క్షమింపవలసిన వాడ్నుగాను. నేనూ నీతో సమాను
డనే. ముందు ఇందిరా, ప్రభాకరుల క్షమాపణ వేడుకో.

శేఖ—(ఇందిరనుచేరి) సోదరీ! మూర్ఖుడనై, కన్నుమిన్ను గానక నేక
దుష్కార్యములను చేసాను. నన్ను క్షమించవా తల్లీ!

ఇంది—సోదరా! అందరినీ క్షమించువాడా భగవంతుడే. నీవాతని
శరణు వేడుము. లెమ్ము.

వీర—దారిలోకి వస్తున్నాడు.

గోపీ—విచారించకుంవోయి విచారించకు.

శేఖ—ఆహా! యిన్ని దుష్కార్యములుచేసి, మొగమెత్తి నలుగురిలో
ఎటుల తిరుగుదును. నేను మొండికెత్తి తిరిగిననూ, పోలీసు
వారు విడతురా? అక్కటా! నాకేదిదారి?

సురే—(ఇందిరను చేరి) సహోదరీ! కామాంధకారము కన్నుల
గప్పుటచే, జ్ఞానహీనుడనై వావివరుసల గణింపక నిన్నుకోరి
నీకనేకగచాట్లు కల్గించేను. నన్ను క్షమించు.

ప్రభా—ఇందిరా! యీతడు తప్పక క్షమింపతగినవాడే. నేను విరా
గినై ప్రాణత్యాగ మొనర్పసంసిద్ధుడనై యుండ, అచ్చట
షికారుగా వచ్చిన వీరునన్నుజూచి, వారించి సర్వముబోధించి
తిరిగి మనయిద్దరి కలయికకుం కారణభూతుడైనాడు.

వీర—బాబయ్యా! పాపం పోగొట్టుకున్నారు.

ఇంది—సురేష్! నీవొకప్పుడు నాకపకారముచేసినా. యిప్పుడు నా
ప్రభాకరాన్ని నాకుచేర్చి మహోపకారంచేసావు. నిన్ను
భగవంతుడు క్షమించుగాక!

శేఖ—మహాశయులారా! నేనొనర్చిన కృత్యములకు త్వరలోనే ఫల

మనుభవింపనుంటిని. విద్యార్థి మహాజనులారా! భావిప్రాపంచిక సౌధమునకు మీరు పునాదివంటివారు. మీ భుజస్కంధములపై భరతమాత భావిజీవిత మాధారపడియున్నది. కాన, నాదినచరిత్రకును హెచ్చరికముగా తీసికొని, దురలవాట్లకు లోనుగాక విద్యాభ్యున్నతి నొందుడు. తిరిగి నాకన్నులకటివు దీజు వీరందరిసమా వేశము చూచితిని. యికనీజీవిత మీయవనిపై వృథా! (ఆత్మహత్య చేసుకొనును)

అందరు—దారుణం. దారుణం.

గోపీ—అరే. ఎంతఘోరం. ఎంతఘోరం. యీడు బలవంతముగా సచ్చి స్వైతాన్ హావడుకదా! (కంగారు పడుచుండును)

వీర—చేసినపనులకు పశ్చాత్తాపపడి ఆత్మహత్య చేసుకున్నాడు.

సురే—అదంతా పూర్వకర్మ ఫలం.

వీర—బిడ్డలారా! (సవరించుకొని) బాబయ్యా! అతని జీవితమలా వ్యర్థమయింది. ఎవరేంచేయగలరు. ముందీయన శవాన్ని పోలీసోల్లకప్పగించి, మనం దుర్గాంబగారి కాడకి పోదాం రాండి.
(నిష్క్రమింతురు) (తెర పడు ను)

---

## నాలుగవ రంగము

ప్రదేశం : వసారాచావడి

ప్రవేశం : దుర్గాంబ, గోపాలం.

గోపా—ఎంతటోకరా యిచ్చేడాపేరయ్యగాడు. వాడిమాటలు నమ్మి గంగలో దిగేను. మళ్ళీ కనిపించనేలేదు. మూడువేలుపుచ్చుకొన్నట్లుగా చిన్న రశీదుముక్కైనా పుచ్చుకున్నాను కాదు.

దుర్గా—అన్నయ్యా! ఊరుకో! విచారిస్తే యేంలాభముంది ? మన నొసటివ్రాత యిలాఉంది.

గోపా—అమ్మాయి! ఊరుకోక చేసేదేమిటి? మూడో పెళ్ళిముచ్చటబడి మూడువేలు గంగపాలు చేశాను. బాబూ బుద్ధొచ్చింది పెళ్ళివద్దు. పెడాకులువద్దు. అసలు ముసలిపీనుగను పెళ్ళికోసం

బాధపడడం నాదేతప్పు అందుకనే భగవంతుడు బాగాబుద్ధి చెప్పేడు.

దుర్గా—నీవలాపాడుచేసావు. నేనాసురేష్ మాటలు నమ్మి మిగిలిన రు 5000 లు తగలేశాను. యింతవరకూ అతని ఆనుపాను ఏమీా తెలియడం లేదు. అంతా అయోమయంలో ఉన్నాము.

గోపా—ఏంచేస్తాం. శాయశక్తులా ప్రయత్నించేశాము. ఎక్కడా వారిజాడ కనిపించందే ?

దుర్గ—అన్నయ్యా! చివరికి మన యిద్దరి బ్రతుకులు యిలాగయ్యాయి యిద్దరిపెళ్ళాల్ని పొట్టపెట్టుకొని, దానితో పాటు మూడో పాల్లికని మూడు నెలలవసరంగా గంగపాలు చేసావు, భర్తను, పిల్లను, ఆస్తినిపోగొట్టుకొని జీవచ్ఛవంలా గున్నాను, నేను.

గోపా—దుర్గా! మనయిద్దరి బ్రతుకులు నిరర్థకములే. నడు యింక మనకా కాశీవిశ్వేశ్వరుని పాదాలే శరణ్యం.

దుర్గ—నిజమే. అత్యంకాలములోనైనా, తీర్థయాత్రచేద్దాం నడు.

(ఇంత గోపీచంద్, ఇందిరా, ప్రభాకరులు, శ్యామలాసురేష్ లు, వీరన్న ప్రవేశింతురు. ఒకరినొకరు చూచుకొని, ఆశ్చర్యముతో కౌగలించుకుందురు)

దుర్గ—తల్లీ! ఇందిరా! మళ్ళీ యెన్నాళ్ళకు నాకంట బడ్డావు తల్లీ! ప్రభాకరం! రా! నాయనా! యిటురా! నీమీాదనిష్కారణముగా అపవాదు వేశాను. క్షమించునాయనా!

ప్రభా—అత్తా! నిన్నుక్షమించుటకు నేనర్హుడనా!

సురే—(దుర్గాంబ పాదములపైబడి) తల్లీ! తిన్నయింటి వాసాలు లెక్కపెట్టిన దుర్మార్గుడను. యీకష్టములన్నిటికి నేనే బాధ్యుడను. నీకు తీరని అపకారంచేశాను. బుద్ధివచ్చింది. తల్లీ! నన్ను క్షమించు.

దుర్గా—నాయనా! ఆరోజున యెడబాటుకల్గించేవు. నిరాశ చేసుకొన్న దశలో తిరిగి యీనాడాశాజ్యోతి వెలిగించావు. యిదంతా విధివిలాసము. మనము నామమాత్రులమే. లే. విచారించకు,

గోపా—తలవని తలంపుగా అందరము కలసికొన్నాం.
దుర్గ—అమ్మా! ఇందిరా! యింతవఱకూ యెక్కడున్నావమ్మా!
ఇంది—అమ్మా! అదంతా పెద్దగాథ. నీకు స్థిమితంగా చెప్తానులే.
దుర్గ—నాకీవేళ చాలా సంతోషంగా ఉంది. నాతల్లి నాకన్నులకఱవు
దీర తిరిగి నిన్ను చూడకలిగేను.
సురే—అంతా సంతోషమే కాని, శేఖరం, మాధవరావుల చావులు
మాత్రం విచారం కలిగిస్తున్నాయి.
అందరు—నిజం. నిజం.
వీర—మీ అందరికీ నిజంగా మాధవరావు చావు విచారకరంగా ఉంది?
అందరు—చాలా యెక్కువగా—
వీర—అష్టకష్టములు సహించి, మృత్యుదేవతనోటబడియు, అంతరించక జీవించియున్న ఆ అభాగ్యవు మాధవరావుని నేనే. (నిజ
రూపము చూపును. అందరూ ఆశ్చర్యనిమగ్నులగుదురు.)
గోపీ—అరే! యిన్నాళ్ళమన్కి తెల్సిందికాదు వీరన్న, మాధవారావూ
గారూ, క్షమించాలి బాబూ. మీతో చాలాపరిహాసం చేశాం.
మాధ—ఎంతమాట. ఇదంతా భగవల్లీల!
దుర్గ—ఆహా! ఎంత సంతోషము. తిరిగి మీ దర్శనభాగ్య మెన్నా
ళ్ళకు కలిగింది. (దగ్గరగా చేరును.)
గోపా—బావగారూ! ముందమ్మాయి నొసట కుంకుమ ఉంచండి.
ఇంది—యిన్నాళ్ళనుండి కనుగొనలేకపోయాను. నీవేనా? నాతండ్రివి.
ప్రభా—మామయ్యా! వీరన్నవు నీవేనా? నా కుత్తరం యిచ్చింది
నీవేనా? ఎంత విచిత్రం?
శ్యామ—వీరన్నే మాధవరావుగారు. మాధవరావుగారే వీరన్న.
అంతా దైవికం.
సురే—(మాధవరావు కాళ్ళపైబడి) మహాశయా! మీకు హానిచేయ
దలంచుట చాలక, మీచేత సేవకూడా పొందేను. ఇన్నాళ్ళ
నుండీ నాతో ఉన్నాకూడా మిమ్మల్ని గుర్తించుకోలేకపోయి
నాను. బాబూ! నన్ను క్షమించండి.

మాధ—నాయనా! లే. యింతటినుండైనా బుద్ధిగా ఉండు.

సురే—యీ వేళ మన కత్యంత శుభదినము.

ఇంది—నాన్నగారూ! మిమ్మల్ని చంపేసామన్నారుకదా! ఎలా బ్రతికివచ్చారు?

మాధ—తల్లీ! అదంతా విచిత్రనాటకం. ఆవేళ నాకు మత్తుమందు వాసనచూపి, తీసికొనివచ్చి, ఎంతకూ తెలివి రాకపోవుటవల్ల కాబోలు, చచ్చినానని తలంచి, నన్ను పాతిపెట్టవలసిందని త్రాగుబోతుల కప్పగించి ఉంటారు. నా అదృష్టంవల్ల వాళ్ళు నన్ను దగ్గఱ పెట్టుకొని త్రాగుడు మైకంలో వాళ్ళు తెలియక ఉండడంవల్ల, సమయానికి ప్రవహాలొస్తు నాకు తెలివి వచ్చుటచే వాళ్ళకళ్ళల్లో దుమ్ముకొట్టి యెలాగో యివతల పడ్డాను.

గోపీ—అరే! ఎంతచిత్రం జరిగిందన్నమాట. చచ్చి బ్రతికేరు మీరు.

సురే—మిమ్మల్ని పాతిపెట్టేశామన్నారా దొంగపీనుగలు. ఎంతపని చేశారు?

మాధ—ప్రయాసపడి, యీపని శేఖరం చేయించిఉంటాడని చూచాయగా తెలుసుకొని వారివద్ద నౌకరుగా ప్రవేశించి. అతినమ్మకంగా ప్రవర్తించి రహస్యమంతా తెలుసుకొన్నాను.

సురే—ఆహా! ఇదంతా నాకొక కలలాగున్నది. ఎంత చమత్కారంగా ప్రవర్తించేరు మీరు?

ప్రభా—మామయ్యా! సంగతి తెలుసుకొన్నాక, పోలీసువారికి రిపోర్టుచేయక, నా ఉత్తర మెందుకు తీసికొనివచ్చావు? నేనా ఉత్తరం తీసికొనిపోయి పోలీసులకు చూపిస్తానంటే, వలదనివారించి నీ వేఆపనిచేయించడాని కెందుకు పూనుకొన్నావు?

మాధ—నీకు నాయందునమ్మకంకోసం. ఇందిరవద్దనుండిఉత్తరం తీసికొనిరావలసివచ్చింది. దుర్మార్గుడు శేఖరంవంటివాళ్ళన్న సురేష్ యింతపనికి పూనుకున్నాడు కాబట్టి నేరమంతా వాడిమీద పోలీసులకు రిపోర్టు చేసి, ఆ రాత్రి సరిగా తొమ్మిది గంటలకు (8గం॥లకు) నీవక్కడకు రావలెనంటున్నావు గాబట్టి, ఆసమ

యానికే పోలీసుల నక్కడకు తీసికొనివచ్చి, శేఖరాన్ని పప్పచెప్పి, అప్పుడంద రెదుట నాచరిత్రచెప్పి, నిన్ను, ఇందిరను, సురేష్‌ను తీసికొని యింటికి పోవచ్చనుకొన్నాను.

ప్రభా—ఎంత కుశాగ్రబుద్ధి!

మాధ—కాని తారుమారైంది. నేను రావడం కొంచె మాలస్యమవడంవల్ల నీవు ఇందిరను తప్పించుకొనిపోయావు. శేఖరం సురేష్‌కు విషప్రయోగంచేసి పారిపోయాడు. అందుచే సురేష్‌తో నేఉంటూ, మద్రాసునగరముచేరి, అనేకపాట్లు పడి మిమ్మల్ని కలుసుకొన్నాను. యిదీ నాసంగతి.

గోపా—ఆహా! ఏమి! భగవంతుని లీలావిలాసములు. ఎప్పు డేక్షణమున కేదికల్గునో యెరుగము కదా! అంతా తలవనితలంపు.

మాధ—జరిగిందేదో జరిగింది. ఈరోజున అందఱము కలసికొన్నాము. యీఆనందసమయంలో ఒకసారి భగవంతునిఆరాధన చేద్దాం రండి.

(తెరయెత్తగాలోన దైవపీఠము కనబడును. అందరు ప్రణమిల్లెదరు. మాధవరావు యిందిరాప్రభాకరులను, శ్యామలా సురేష్‌లను కలపి నలువురకు దేవుని మెడలోని పూలహారములనిచ్చును)

మాధ—బిడ్డలారా! మీరిదివఱకే దాంపత్యసుఖ మనుభవించుచున్నను, యీనాదినమున దేవునిసముక్షమున మిమ్ములను దంపతులుగా చేయుచున్నాను. మీ రన్యోన్య ప్రేమపీడితులై, సంఘసేవచేయుచు, ఆదర్శప్రాయులై సంసారసాగరము నీదెదరుగాక!

(ఒండొరుల పూలమాలలు ధరింతురు. అందరు "తథాస్తు" అని అక్షతలు చల్లుదురు.)

గోపి—మన్కి యివాళ బహుత్ కుషీగా ఉందీ అండీ.

గోపా—యీ యిందిరకొఱకు మేమెంతమందిప్రయత్నించినా ఆఖరికి 'మేనరికమే' జరిగింది.

అందరు—అవును, మేనరికమే జరిగింది.

మాధ—బిడ్డలారా! భావిప్రపంచ్యశాంతిత్యమ్మునకు కారణభూతులు మీరే మీ భుజస్కంధములపై ప్రపంచస్థితి ఆధారపడి యున్నది. భారతమాత భావిజీవితము మీ హస్తగతమై యున్నది. కాన మీమీ బాధ్యతల నెరిఁగి, భరతపుత్రులమని పించుకొనుచు, ఆమె దాస్యవిమోచనము చేయుడు. అదియే నాకోరిక.

ప్రభా—నాదొక చిన్నకోరిక. ప్రస్తుతం దేశంలో నిరుద్యోగపిశాచి తాండవించుచున్నది. కాబట్టి ధనికులమగు మనము మన డబ్బును పరిశ్రమలకై వెచ్చించి మనసోదరుల ఆకలిమంట చల్లార్చాలి. ప్రస్తుతం యీయుద్ధానికి కావలసిన పనిముట్లు మున్నగునవి తయారుచేసి భారతీయవిజ్ఞానాన్ని దేశ దేశముల చాటాలి.

సురే—ఈయభిప్రాయం చాలా బాగుంది. అలా పరిశ్రమలను వృద్ధి చేయడంవల్ల మనకా లాభం వొస్తుంది. మనతోడి సోదరులకా కడుపు నిండుతుంది. యుద్ధమునకు పనికివచ్చే సామానులు మొదలగునవి తయారుచేసి, ప్రపంచకళ్యాణానికి పాటుపడు తూన్నమన బ్రిటిష్ప్రభుత్వంవారికి సహాయంచేసి మన దేశాన్ని శత్రుభీతిలేకుండా రక్షించుకొన్న వారమౌతాము. అందుచే శేక్ గారితరఫున ఆయనాస్తంతా యీవిషయంలో వినియోగిం చడానికి సిద్ధంగా ఉన్నాను.

గోపా—నాసర్వస్వము యీవిషయములో ధారపోస్తాను.

మాధ—యీవిషయంలో ప్రభుత్వంవారినికుండా సహాయంచేయుమని కోరుదాము.

గోపీ—యింకా చాలుఅండీ. లేవండి. చాలా టైమయిపోయింది.

అందరు—ఆ! అలాగే! (నిష్క్రమింతురు)

(తెర పడును)

సమాప్తము.

## క్లాసుమేట్సు

రః రమ్యాలోకనీయమైన నాటకంలో పెద్ద చదువులు చదివిన కాలేజీ ప్రిన్సిపాల్సు లెక్చరర్సు చేయు వింతచర్యలు, కాలేజీ ట్రస్టీల అధికారదుండగాలు, కాలేజీ ప్యూను ఫిమేలు మెయిడ్ సర్వెంట్ల సరససల్లాపాలు, కాలేజీ మేలు ఫిమేలు స్టూడెంట్సుల ప్రేమకలాపాలు లోనుగాగల సంస్కరణ తత్వమంతా మధురరూపకంగా చిత్రింపబడినది. వెల రు 1—8—0

## గర్భపతి

పుష్పవతియై యింట్లో గూర్చొని తలిదండ్రులు కుదిర్చిన వరుని పెండ్లిచేసికొనక రహస్యముగా దానొకనిని ప్రేమించి వానివలన గర్భము ధాల్చి యతనిని దక్క వేరొక్కని నొల్లనని ప్రతినగొన్న చంద్రలేఖ యను సుందరాంగి కష్టకథ సాంఘికరూపకముగా హాస్య సంభాషణలతో నిర్మింపబడినది. వెల రు 1—8—0

## వెన్నెల

నాగరికతావేశమున మగతనము నీసడించి ఆలితనము విడచి విచ్చల విడిగా తిరిగి మచ్చల దెచ్చుకొనువా రీ లోకమునకు నీతిదీప్తిని వెదజల్లు వెన్నెల! ముసలితనమున మూడవ పెండ్లాముగ ముక్కుపచ్చలారని ముగుదలను పెండ్లాడి, పిశాచావేశమున ఆరళ్లపెట్ట వారు కట్టుత్రాళ్ల తెంచుకొని కళ్ళయెదుటనే గుట్టుమట్టుగ వ్యభిచరింప రట్టుజేసిన మొట్టమొదటికే మోసమువచ్చునని బెట్టుగా సంసారము నెట్టుకొనుచు లోలోపల క్రుంగి కృశించు వృద్ధరాకాసుల కరచేతిలో స్వర్గమును చూపు వెన్నెల!

వెల రు 1—8—0

## శ్రీలక్ష్మి

విద్యావతులై పెళ్ళిక్కర్లేదని భీష్మించుకొని కామా న్నరికట్టలేక కానిపనులు చేసే కాంతలను మంచిత్రోవకు మళ్లిస్తుంది. తన భార్య రెండవ సావిత్రే అని విశ్వసించి సుఖవిలాస సముద్ర డోలికలలో నూగులాడి పది రోజులు పుట్టింటికి పోతే పరాయిస్త్రీని పంచకు జేర్చి పతివ్రతాలలామయైన పత్ని పాదాలకడకు వస్తే నెట్టివేసి పాపియై నిరుపేదయై భిక్షకుడై పరితాపాగ్నిలో పురుషాధములకు జీవం పోస్తుంది. వెల రు 1—8—0

---

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి.

# ఆంధ్రనాటకములు

| | రు | అ |
|---|---|---|
| **బళ్ళారి ధర్మవరం గోపాలాచార్యులుగారి** | | |
| రామదాసు | 1 | 8 |
| **బళ్ళారి ౼, బాలసరస్వతిగారి** | | |
| భక్తతుకారామ్ | 1 | 8 |
| **గురజాడ అప్పారావుగారి** | | |
| కన్యాశుల్కము | 2 | 0 |
| **బళ్ళారి పండిత కే. సుబ్రహ్మణ్యంగారి** | | |
| కృష్ణలీల | 1 | 8 |
| లవకుశ | 1 | 8 |
| భక్తకుచేల | 1 | 8 |
| మేవాడు శౌర్యాగ్ని (చరిత్రాత్మక నాటకము) | 1 | 8 |
| విభీషణ పట్టాభిషేకము అను (లంకాదహనము) | 1 | 8 |
| ద్రౌపదీ వస్త్రాపహరణము | 1 | 8 |
| మిహిర (పద్మిని) | 1 | 8 |
| **ముత్తనేని వెంకట చెన్నకేశవులుగారి** | | |
| తులసీదేవి (సతీతులసి) | 1 | 8 |
| **చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి** | | |
| గయోపాఖ్యానము | 1 | 12 |
| ప్రసన్నయాదవము | 1 | 8 |
| పారిజాతాపహరణము | 1 | 8 |
| **చందాల కేశవదాసుగారి** | | |
| కనకతార | 1 | 8 |
| **విద్వత్కవి మల్లాది అచ్యుతరామ శాస్త్రిగారి** | | |
| సక్కుబాయి (అసలు స్టేజి నాటకం) | 1 | 8 |
| **శ్రీరాముల సచ్చిదానందశాస్త్రిగారి** | | |
| సావిత్రి | 1 | 8 |

| | రు | అ |
|---|---|---|
| **కీ. శే. కాళ్ళకూరి నారాయణరావుగారి** | | |
| వరవిక్రయము | 1 | 8 |
| పద్మవ్యూహము | 1 | 8 |
| చిత్రాభ్యుదయము (సారంగధర) | 1 | 8 |
| **బలిజేపల్లి లక్ష్మీకాంతం కవిగారి** | | |
| సత్యహరిశ్చంద్రీయము | 2 | 0 |
| **మానాపురం అప్పారావు పట్నాయక్ గారి** | | |
| రేవతి | 1 | 8 |
| **శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి** | | |
| బొబ్బిలియుద్ధము | 1 | 8 |
| **విష్ణుభట్ల సుబ్రహ్మణ్యంగారి** | | |
| సారంగధర | 1 | 8 |
| **కాజ రాధాకృష్ణశాస్త్రిగారి** | | |
| జన్మభూమి | 1 | 4 |
| అమరజ్యోతి | 1 | 8 |
| మాధవవర్మ | 1 | 8 |
| ఝాన్సీరాణి | 1 | 8 |
| **వేదాంత కవిగారి** | | |
| తెనుగుతల్లి | 1 | 8 |
| ఆకలిమంట | 1 | 8 |
| కష్టకాలము | 1 | 8 |
| మహారథి కర్ణ | 1 | 8 |
| విశ్వస్వరాజ్యం | 1 | 8 |
| **ఊటుకూరు సత్యనారాయణరావుగారి** | | |
| వీరాభిమన్యు | 1 | 8 |
| అనార్కలీ | 1 | 8 |
| ఛత్రపతి శివాజీ | 1 | 8 |
| అహల్య | 1 | 8 |
| ద్రౌపదీ వస్త్రాపహరణము | 1 | 8 |

---

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి.